





# భగవద్గీత

వచన

## మన సమస్యలకు భగవద్గీత పరిష్కారాలు



## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

**గమనిక:** భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

http://ebooks.tirumala.org

ebooks.tirumala.org

తిరుమల తిరుపతి దేవస్థానములు
Tirumala Tirupati Devasthanams
ePublications

Languages | Series | Authors | Archives | Saptagiri | Catalog | Contact US

: COMPLAINTS PLS CONTACT e MAIL saptagiritd@gmail.com CAN CALL 0877 226 4359, 4543,4360,4363, 4385 BETWEEN 10.30 AM AND 5.PM (DURING WORKING DAYS)

- TELUGU (1197)
- BANJARA (2)
- ENGLISH (226)
- SANSKRIT (70)
- TAMIL (302)
- KANNADA (175)
- HINDI (181)

Saptagiri

Telugu Tamil Sanskrit Kannada Hindi English

Online Subscription

Panchangam

Telugu Tamil

Sri Bhagavad Ramanuja 'Sahasrabdi' Utsavam

Narada Bhakthi Sutra...

prev next

Maha Bharatham - Bhagavatham

Maha Bharatham Vol 1...

Potana Bhagavatam Vo...

Potana Bhagavatam Vo...

Potana Bhagavatam Vo...

Potana Bhagavatam Vo...

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మన సమస్యలకు భగవద్గీతా పరిష్కారాలు

ప్రొ॥ ఎస్.బి. రఘునాథాచార్య



తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# మన సమస్యలకు భగవద్గీత పరిష్కారాలు

రచన:
డాక్టర్ ఎస్.బి. రఘునాథాచార్య, ఎమ్.ఏ., పిహెచ్.డి.



ప్రచురణ
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.
2006

# ముందుమాట

ఆధ్యాత్మిక వాఙ్మయానికి ఆదిమసోపానాలు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత. ఈ మూడింటికీ ప్రస్థానత్రయమనే ప్రసిద్ధ వ్యవహారమేర్పడింది. ఉపనిషత్తులు అతివిస్తారంగాను బ్రహ్మసూత్రాలు అతిసంక్షిప్తంగాను ఉండగా; భగవద్గీత అన్యూనానతిరిక్తంగా తన స్వరూపాన్ని సంతరించుకున్నది. భగవంతుని ముఖకమలం నుంచి వెలువడింది కాబట్టి పవిత్రమైన గ్రంథంగా పరిగణించబడింది.

భగవద్గీత ఏ కొందరినో ఉద్దేశించి ఉపదేశింపబడింది కాదు. మానవ జాతి మంచిగా మనుగడసాగిస్తూనే జన్మపరంపరలను తరించడానికి భగవంతు డందించిన మహాప్రసాదం. అంతేకాదు; విన్నంతమాత్రానే జీవులందరికి భవబంధాలనుంచి విముక్తి ప్రసాదించగల పవిత్రశబ్దరాశి.

ఈనాటి మానవుడు అజ్ఞానంతో అహంకారంతో గమ్యం తెలియని జీవితాన్ని గడుపుతున్నాడు. ఇంద్రియాలు చూపుతున్న మార్గాలవెంట పరుగెడుతున్నాడు. అతడికి శాంతి కనుచూపుమేరలో కనబడటం లేదు. నిత్యం అశాంతితో జీవితాన్ని అట్టా అట్టా నెట్టుకొస్తున్నాడు. అంతులేని ఆశలతో సతమతమౌతూ ఆనందాన్ని అనుభవించ లేకపోతున్నాడు.

ఇలాంటి అయోమయస్థితిలో ఉన్న సమాజానికి మార్గనిర్దేశం చేయాలనే భావనతో ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్యగారు భగవద్గీతకు ఒక కొత్త ఒరవడిని సృష్టిస్తూ రచించిన గ్రంథమే ''మన సమస్యలకు భగవద్గీతా పరిష్కారాలు''.

ప్రతిదినం సమాజంలో ఉన్న ప్రతివారు ఎదుర్కొనే ఎన్నో మౌలిక సమస్యలకు భగవద్గీతనుంచి చక్కని పరిష్కారాలను కనుగొనడంలో రచయిత చూపించిన నేర్పు కొనియాడదగింది. సూటిగా పాఠకుడి హృదయం స్పందించేటట్లు లలితమధురంగా సాగిన రచన ఇది. సరళమైన ప్రజలభాషలో గంభీరమైన తత్త్వార్థాన్ని అందించడంలో ఆచార్యులవారు అందెవేసిన చేయి. అందుకే ఇది అంతటి ఆదరణకు పాత్రమైంది. వారికి మా అభినందనల నందిస్తున్నాము.

తిరుమల తిరుపతి దేవస్థానం ఈ రచనను ఇప్పటికే పలుమార్లు ప్రచురించింది. ఆసక్తిగల పాఠకుల అభ్యర్థనలననుసరించి ఇప్పుడు ఈ పునర్ముద్రణను మీముందుంచుతున్నాం.

''యోగః కర్మసు కౌశలమ్''

**కార్యనిర్వహణాధికారి**

తి.తి.దేవస్థానములు, తిరుపతి

# ఆముఖం

డా. ఎస్. బి. రఘునాథాచార్య
సంస్కృత విభాగం
శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం

ప్రస్థానత్రయం — విశ్వమంతటా విరాట్పురుషుణ్ణి సాక్షాత్కరించుకొని సకల వేదాంత సారాన్ని సర్వమానవ కల్యాణం కోసం చాటిచెప్పిన జాతి మన భారతజాతి. ఈ గడ్డమీద పుట్టి పెరిగిన ప్రాచీన భారతీయుడు భోగలాలసుడై ఆహార-నిద్రా-భయ మైథునతత్పరుడై, పశువులతో సామ్యాన్ని పొందకుండా, తనలో వాటికంటే విశిష్టతమ బుద్ధి బలంతో గుర్తించాడు. తానెవరు? ఈ ప్రపంచం ఏమిటి? తనకు ఈ ప్రపంచానికి ఏమిటి సంబంధం? ఈ ప్రపంచాన్ని, తనని సృష్టించిన వాడెవడయినా ఉన్నాడా? అని ఈ రకంగా ఆలోచించసాగాడు. అతడి ఆలోచనల ఫలితాలే, అతడి విచార సారాంశాలే ఈనాడు మనం చూస్తున్న వేదాంతాల మూలతత్త్వాలు.

ప్రస్థానం అంటే బయలుదేరడం. ఒక్కొక్క కాలంలో, అప్పటి పరిస్థితులను, అధి కారులను బట్టి ఏర్పడ్డ తాత్త్విక మార్గాలకే ప్రస్థానాలని తరువాత వ్యవహారం ఏర్పడింది. ఇందులో వేదాలకు చివర ఉండడం వల్లా, జ్ఞానరూపమైన వేదరాశియొక్క పరమ సిద్ధాంతం కావడం వల్ల వేదాంతాలని పేరుపడ్డ ఉపనిషత్తులు మొదటి ప్రస్థానం. అప్పటి మహర్షులు, వారి విచారధార, వారి సంస్కృతి, వారి తత్త్వాన్వేషణ పద్ధతి మనకు అందులో కనబడుతుంది. కాలం గడిచింది. మానవుల అర్హతలు, శక్తియుక్తులు మారినాయి. ఉపనిషత్తుల వల్ల ఇతడికి బుద్ధివ్యామోహం కలుగుతున్నదే కాని, కర్తవ్యం బోధపడటం లేదు. వేదవ్యాసుడవతరించాడు. వేదాలను ఋగ్యజుస్సామాథర్వణాలుగా వర్గీకరించాడు. వేదోపబృంహణం కోసం ఎన్నో పురాణాలు రచించాడు. అందులో పంచమ వేదమనే ప్రసిద్ధి పొందింది మహాభారతం. మహాభారతంలో ఆరవదైన భీష్మ పర్వంలో విషణ్ణ హృదయు డైన అర్జునుడికి కర్తవ్యాన్ని బోధించడానికి శ్రీ కృష్ణపరమాత్మ ఉపదేశించిందే భగవద్గీత. ఇది రెండవ ప్రస్థానం. దీనికి ఉపనిషత్తులే మూలమైనా, ఇందులో ప్రతిపాదన పద్ధతి తార్కి కమై విషయనిష్కర్షకు ఉపయోగపడుతుంది. వేదోప బృంహణం కోసం మహాభారతాన్ని రచించాడు వేదవ్యాసుడు. వేదాలను వర్గీకరించి మహాభారతంలో వేదాంతసారమయిన భగ

వద్గీతను పొందుపరచినా ఆయనకు తృప్తి కలగలేదు. చాలామందికి సంశయాత్మక ఘట్టాలు ఈ రెండిట్లో ఎన్నో ఎదురవుతున్నాయి. అందుకనే తన తాత్పర్యాన్ని సూటిగా చెప్పడానికి నాలుగు అధ్యాయాలలో ఉపనిషత్సారాన్ని, భగవద్గీత సారాన్ని బ్రహ్మసూత్రాలనే పేరుతో రచించాడు. ఇది మూడవ ప్రస్థానం. ఇలా మనకు ప్రస్థానత్రయం ఏర్పడింది. ఈ ప్రస్థాన త్రయంలో మధ్యమణి స్థానాన్ని ఆక్రమించుకుంది భగవద్గీత.

1. భగవద్గీత — భగవంతుడు శ్రీ కృష్ణపరమాత్మ. కురుపాండవ యుద్ధంలో అర్జునుడు అజ్ఞానంతో మమకారంతో నావారి నందరినీ నేనెలా సంహరిస్తానని పలాయనం చిత్తగిస్తుంటే జాలిపడి, అతన్ని వ్యాజంగా పెట్టుకొని ప్రాణికోటి కంతటికి భగవంతుడు ఉపదేశించిన తత్త్వామృతమే భగవద్గీత.

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సస్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥

భగవంతుడిచే గానం చేయబడింది కాబట్టి భగవద్గీత. ఇందులో 700 శ్లోకాలు, 18 అధ్యాయాల్లో చెప్పబడ్డాయి.

2. శ్రీ కృష్ణావతార ప్రయోజనం — శ్రీ మహావిష్ణువు ధరించిన పది అవ తారాలకు సామాన్య ప్రయోజనాలు దుష్టశిక్షణ, శిష్టరక్షణ. కానీ ఒక్కొక్క అవతారంలో ఒక్కొక్క విశిష్ట ప్రయోజనం కూడా ఉంటుంది. అలా ఆలోచించినప్పుడు, శ్రీరామావ తారంలో ఆయన ధర్మమూర్తిగా, ఆదర్శ ప్రభువుగా లోకానికి ఆచరణ ద్వారా ధర్మాన్ని ఉపదేశించాడు. సామాన్య మానవుడుగా అందరిలో ఉండి, అనేక బాధలు పడుతూ కూడా ధర్మాన్ని అణుమాత్రం గూడ దాటకుండా రక్షించాడు. అది ఆ అవతారానికి విశిష్ట ప్రయోజనమని చెప్పవచ్చు. అది త్రేతాయుగం. తరువాత ద్వాపరయుగం వచ్చింది. ధర్మ స్వరూపం, మానవుల మనస్తత్వం మారిపోయినాయి. యుగధర్మ ప్రభావాలకు మానవుడు బందీ అవుతున్నాడు. ఆదర్శ ప్రవర్తన వల్ల కేవలం లోకాన్ని జాగృతం చేయడం సాధ్య మయ్యే పనికాదు. అందుకనే భగవంతుడు వాగ్రూపంగా జీవతత్త్వాన్ని, ప్రపంచతత్త్వాన్ని ఈశ్వర తత్త్వాన్ని ఉపదేశించ దలచాడు. అవతరించిన దగ్గఱనుంచి సమయంకోసం ఎదురు చూస్తూ ఉన్నాడు. కురుక్షేత్ర యుద్ధం వచ్చింది. అందుకే పార్థసారథి అయినాడు మాయా నాటక మాత్రధారి. అర్జునుడి ప్రగల్భాలన్నీ విన్నాడు. అతడు రథం దిగి పారిపోయే వఱకు చూశాడు. అప్పుడు అతన్ని ఒక నెపంగా పెట్టుకొని తత్త్వశాస్త్ర రహస్యాన్ని

లోకానికి బోధించాడు. అలా ఆయన ఉపదేశించబట్టే భగవద్గీత, భగవద్గీతగా ఈనాటికీ పరమ ప్రమాణంగా నిలబడింది.

3. అధ్యాయాల పారాయణ ఫలాలు – భగవద్గీత పారాయణవల్ల కొన్ని ఫలాలు కలుగుతాయని మనవాళ్ళు చెపుతారు. ఇవి అందులో ఉండే విషయాలను అర్థం చేసుకోవడం వల్ల కలిగేవి కావు. నియమంతో పారాయణ చేస్తే దానివల్ల పాపాలు పోయి పుణ్యం కలగడంవల్ల కలుగుతాయి. ఇవి వాటి వివరాలు.

1. అర్జునవిషాదయోగం – దీన్ని చదవడంవల్ల మానవుడికి పూర్వ జన్మస్మృతి కలుగుతుంది.

2. సాంఖ్యయోగం – దీని వల్ల ఆత్మస్వరూపం గోచరిస్తుంది.

3 కర్మయోగం – దీన్ని ఎవరైనా పారాయణం చేస్తే, ఆత్మహత్య వగైరాల వల్ల చనిపోయి, ప్రేతత్వం పోకుండా ఉండే జీవులక్కడ ఉంటే వారికి ప్రేతత్వం నశిస్తుంది.

4-5. జ్ఞానయోగం – కర్మసన్న్యాసయోగం – ఈ అధ్యాయాలు వింటే చెట్లు, పశువులు, పక్షులు గూడ పాపం నశించి, ఉత్తమగతిని పొందుతాయి.

6. ఆత్మసంయమయోగం –పారాయణచేస్తే సమస్త దానాల ఫలితం కలిగి విష్ణుసాయుజ్యం కలుగుతుంది.

7. విజ్ఞానయోగం – ఈ అధ్యాయాన్ని వింటే జన్మరాహిత్యం కలుగుతుంది.

8. అక్షరపరబ్రహ్మయోగం – ఈ అధ్యాయం వింటే స్థావరత్వం, బ్రహ్మరాక్షసత్వం తొలగిపోతాయి.

9. రాజవిద్యా రాజగుహ్యయోగం – దీన్ని చదివితే ఇతరుల దగ్గర ఏదైనా వస్తువు తీసుకున్నందువల్ల మనకు వారినుంచి సంక్రమించిన పాపం నశిస్తుంది.

10. విభూతియోగం – ఆశ్రమధర్మాలన్నీ సక్రమంగా నిర్వహిస్తే ఏపుణ్యం కలుగుతుందో అది లభిస్తుంది. జ్ఞానం బాగా ఏర్పడుతుంది.

11. విశ్వరూప సందర్శనయోగం – దీన్ని పారాయణం చేయడంవల్ల చనిపోయిన వారు కూడా తిరిగి జీవిస్తారు.

12. భక్తియోగం – దీనివల్ల ఇష్టదేవతా సాక్షాత్కారం కలుగుతుంది. చనిపోయిన వారు కూడా దీనివల్ల బ్రతుకుతారు.

13. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగం – దీన్ని పారాయణం చేస్తే చండాలత్వం నశిస్తుంది.

14. గుణత్రయ విభాగయోగం – దీనివల్ల స్త్రీహత్యాపాతకం, వ్యభిచారదోషం నశిస్తాయి.

15. పురుషోత్తమ ప్రాప్తియోగం – ఇది భోజనానికి ముందు చదవతగింది. దీనివల్ల ఆహారశుద్ధి కలుగుతుంది. మోక్షం సిద్ధిస్తుంది.

16. దైవాసుర సంపద్విభాగయోగం – దీనివల్ల బలపరాక్రమాలు, సుఖం లభిస్తాయి

17. శ్రద్ధాత్రయవిభాగయోగం – దీనివల్ల ఎన్నో తీవ్రమైన వ్యాధులు నశిస్తాయి.

18 మోక్షసన్న్యాసయోగం – దీనివల్ల సమస్త యజ్ఞాచరణఫలం కలుగుతుంది. ఉద్యోగం లభిస్తుంది.

ఇలా వెనకటి లాగా ఆయా ప్రయోజనాల కోసం పారాయణలు చేసే సంప్రదాయం నశించి పోయింది. ఇలా చేయమంటే నవ్వుతారు కూడా. మరి దేనికి భగవద్గీత? ఎవరి కోసం భగవద్గీత?

4. భగవద్గీత ఎవరికి? — చాలా సంవత్సరాలు జరిగాయి. ఇప్పుడు మన సమాజానికి చాలా పెద్ద చిక్కుప్రశ్న లెదురైనాయి. పారాయణలు నియమనిష్ఠలతో చేసే ఓర్పూ ఓపిక సన్నగిల్లాయి. నమ్మకాలు కూడా తగ్గిపోయాయి. భగవద్గీత ప్రయోజనం దాదాపు శూన్యమైంది ఈ సమాజానికి. ఆధునిక నాగరకతా సంస్కారాలు మనస్సులో విలయతాండవం చేస్తున్న కొంతమంది ఇలా అంటున్నారు. "సర్వరోగాలకు ఒకే మందా? అని లోకంలో ఉన్న వాళ్లకందరికీ భగవద్గీత ఒక్కటే శరణ్యమా? అదేదో జీవితంలో దెబ్బతిన్నవాళ్ళకు, వ్యాపారాల్లో నష్టపడ్డవాళ్లకీ, సంసారాన్నుంచి పారిపోదలచిన వాళ్లకీ అలాంటి ఇతరులకు కావాలంటారుగాని మాకందరికీ అప్పుడే భగవద్గీత ఎందుకండీ? మాకు ఉప్పు, కారాలు జీర్ణమౌతున్నాయి. కళ్లుబాగానే కనబడుతున్నాయి. కాళ్లింకా పట్టుకు పోలేదు. మతి స్థిమితంగానే ఉంది వయస్సేదో వస్తోంది గాని ఈ లోకంలో పుట్టి మేమేం సుఖాలు అనుభవించాం గనక. అది మా అమ్మమ్మలాంటి వాళ్లకు తాతయ్యల్లాంటి వాళ్లకు చెప్పండి." అని. భగవద్గీత, పైన చెప్పిన వాళ్లకే గాని నిజంగా అందరికీ పనికిరాదా? పనికొచ్చేదే అయితే ఏమిటి ఖర్మ?

4. 1 భగవద్గీత సన్న్యాసులకా? — కొందరి వాదన ప్రకారం జీవితంలో భయపడి, పెళ్లాం గయ్యాళిదైతేనో, లేక మరానికి సంబంధించిన ఆస్తి వారసుల్లేకుంటే ప్రభుత్వం పరమౌతుందనో, సంసారంలో ఉంటే ధనసంపాదనకు, స్వేచ్ఛా

విహారాలకు వీలు కుదరదం లేదనో కాషాయాలు కట్టుకొని, తలలు బోళ్లు చేయించు కొని సన్న్యాసులమై పోయామనుకొనే త్యాగపురుషులకు గాని, గృహస్థులుగా చాలా సుఖపడుతున్నామనుకుంటున్నవాళ్లకి భగవద్గీత అక్కరలేదు. ఇది సత్యం ఎలా ఔతుంది? భగవద్గీత సన్న్యాసుల ధర్మాలను చెప్పేది కాదే.

4. 2. భగవద్గీత ముసలి వాళ్లకా?— యువకులు కొందఱంటారు. "ఆత్మ, మనస్సు ఇంద్రియాలు, వీటి నిగ్రహం ఇవన్నీ శరీరంలో రక్తం ఎండిపోయి, నవనాడులూ కుంగిపోయి, కళ్లు సరిగా కనపడక, చెవులు సరిగా వినపడక, కర్ర పోటేసుకుంటూ, ఉద్యోగాలనుంచి విరమించి, ఉద్యోగానంతరవేతనం జీవితాంతంలోగా వస్తుందనే ఆశలేక ఏదో జీవచ్ఛవాల్లా ఉండే ముసళ్లకు అవసరం. కాబట్టి మీ భగవద్గీత వాళ్లకుపయోగిస్తుంది. ఎందుకంటే ఇంట్లో పెళ్లాం, కొడుకులు, కోడళ్లు లెఖ్ఖ చేయకుండా ఉంటే ఒక పాకెట్ సైజ్ భగవద్గీత కొనుక్కొని జేబులోపెట్టుకుని, అలా షికారుకని వెళ్ళి ఏ ఊరి చివఱో కూర్చుని చదువుకోవచ్చు. ఏదైనా తెలిస్తే అర్థం జేసుకొని, కొడుకులతో, కోడళ్లతో పోట్లాడకుండా నిగ్రహంగా ఉండచ్చు. వాళ్ళు పడేసిన చప్పిడి మెతుకులు తిని ఓర్పుతో ప్రాణాలు నిలుపుకోవచ్చు. కాబట్టి ముసలివాళ్లకు భగవద్గీత ఎంతైనా అవసరం. మాకేం పని" అని. అలా ముసళ్లకే అనుకుందామంటే ఈ సమాజాన్ని చూసినప్పుడు ఇంద్రియ నిగ్రహం, మనోనిగ్రహం ముసళ్లకంటే యువకులకే ఎక్కువ కావాలనిపిస్తున్నది. మఱి ముసళ్లకే సవడం న్యాయమా?

4. 3. భగవద్గీత రోగగ్రస్తులకా?— కొందఱు ప్రబుద్ధులంటారు. దేవుడి దయవల్ల మా డాక్టరుగారి దయవల్ల మేం ఆరోగ్యం గానే ఉన్నాం. మాకు కాళ్ళూ, కళ్ళూ, పనిచేస్తున్నాయి. మంచాన పడలేదు. కాబట్టి మాకంటే ఎవరైనా మంచానపడి లేవలేక ఇంకా వెలలో రోజులో అనుకునే వారికి చెపితే పాపం మోక్షమైనా పొందు తారు. మాకేం తొందరండి" అని. ప్రతివాడూ మంచాన పడి గాని తన అవతార పరిసమాప్తి చేయడని ఏమిటి గ్యారంటీ? పైగా అనారోగ్యంతో శరీరం శిథిలమై పోయినవాడు వాడు భ గ వ ద్గీ త ను విని చేయ గలిగేదేముంది కాబట్టి. మీరు వినలేదా- యువైవ ధర్మశీలః స్యాత్ అనిత్యం ఖలు జీవితమ్।

కో హి జానాతి కస్యాద్య మృత్యుకాలో భవేదితి ।

అని. ఈ అనిత్యమైన జీవితంలో ఎవరెంతవరకూ ఉంటారో ఎవరికీ తెలియదు.

కనుక యౌవనంలోనే ధర్మమార్గంలో నడవాలి. కాబట్టి రోగగ్రస్తులకే భగవద్గీత అనడం పరిహాసాస్పదం.

4. 4. భగవద్గీత అసమర్థులకా? — ఈ సమాజంలో కొందరు అహంకారమూర్ఖులు అంటారు. "అయ్యా! నా తెలివితేటలున్నంతవరకు నాకు దేవుడూ అక్కర్లేదు, దయ్యం అక్కరలేదు. నేను ఎవరిమీద ఆధారపడ దలచలేదు. నా కాళ్ళమీద నేను నిలబడ దలచాను. నేనెప్పుడూ సమర్థతలేకుండా ఏ పనులు చేయను. ఎలా అవతల వాళ్ళని పడగొట్టాలో, అట్టే డబ్బు ఎలా సంపాదించాలో నాకు బాగా తెలుసు. నామీద నాకు విశ్వాసముంది. మీ భగవద్గీతలూ, బ్రహ్మపురాణాలు తెలివి తేటల్లేని వారికి కావాలి గానీ నాకెందుకండీ" అని. తెలివితేటలు గలవారు మాట్లాడే మాటలేనా? ఇవి. అసమర్థుల కంటే సమర్థులకే భగవద్గీతకావాలి. దేనికి? మంచిపనులు ఇంకా సమర్థతతో చేయడానికి. అసమర్థులేం చేసుకుంటారు భగవద్గీతని?

4. 5. భగవద్గీత అందరు చదవచ్చా? — మరికొందరు అతివినయసంపన్నులంటారు: "భగవద్గీత నాబోటివాళ్లు చదవచ్చా? అందరు చదవకూడదట కదా! ఆ పుస్తకం ఇంట్లో ఉన్నా మంచిది కాదంటారే! అది ఎవరో కొందరే ముట్టుకోవాలట గదా! మాకెందుకు లెండి అలాంటప్పుడు. 'బావి తవ్వితే దయ్యం బయట పడ్డట్టు' ఇంత వరకు చదవకుండా ఇప్పుడు చదివితే మాకేం అనర్థం కలుగుతుందో" అని. ఇది ఒక మూర్ఖవాదం. లేక పోతే అందంగా చెప్పాలంటే గడుసువారి మాటలు. వ్యాధులు మీలో ఉన్నాయి. బజారులో మందులున్నాయి. బెట్టుసరి చేస్తే నష్టం మందులకా? మీకా?

4. 6. భగవద్గీత చదివితే ఏం లాభం? — లాభనష్టాల లెక్కలపై జీవించే వారంటారు: తప్పకుండా భగవద్గీత చదువుతామనుకోండి మాకేం లాభం, ఏ రూపంలో కలుగుతుంది? మరి మేం చాలా సమయం ఖర్చుపెడతాం కదా! తగినంత లాభం లేకుండా ఏ పని చేయడం మాకలవాటులేదు" అని. మీకు ఇలాంటి దురాలోచనలు పోవడం మొదటి లాభం. ఆపైన మీరు ఇప్పటికి ఎంతకాలం వృథాచేశారో, నిజంగా అజ్ఞానంతో ఎంత నష్టపడ్డారో తెలియడం రెండోలాభం. నిజంగా లాభం కావాలనే పట్టుదలే మీకుంటే మీరే భగవద్గీత చదవడానికి అర్హులు.

5. వేదాంతసారమే భగవద్గీత :— ఇలాంటి, చెప్పదంటు ప్రశ్నలు ఇంకా ఇంతకంటే హాస్యాస్పదమైనవీ సమాజంలో ఎన్నోమాటలు మనం వింటుంటాం. ఇలాంటి వ్యాముఖుల్ని చూచి చాలా జాలిపడాలి. ఎందుకంటే ప్రపంచంలోవి జీవులందరికీ భగవద్గీత వల్ల ప్రయోజనం ఉంది. సూర్యుడు నాకెందుకంటే? అవే సూర్యుడు ప్రపంచంలో ఏదేశంలో నైనా ఉంటాడా? ప్రాణవాయువును తిరస్కరించే జడుడెక్కడైనా ఉంటాడా? ప్రపంచంలో ఉన్న సకల వేదాంతాలకు మూలసూత్రాలన్నీ భగవద్గీతలో పొందుపరచబడి ఉంటే, భారతీయ వేదాంత దర్శనసర్వస్వం భగవద్గీతలో సాక్షాత్కార మిస్తుంటే, పుట్టిన ప్రతి వాడికీ సంబంధించిన సమస్యలే భగవద్గీతలో చర్చింపబడి ఉంటే, భగవద్గీత అందరికీ కావాలా? అక్కఱ లేదా? అనే మీమాంస ఏమిటి?

6. ప్రతిజీవికీ భగవద్గీత కావాలి :— భూమిమీద పుట్టిన ప్రతి జీవికీ భగవద్గీత కావాలి. మానవులకు జ్ఞానంద్వారా, అది ఉపయోగిస్తుంది. మానవేతరులకు ఆశబ్దాలు చెవున పడినంత మాత్రానే పాపాలు నశించి ఉత్తమ జన్మలు కలుగుతాయి. కనుక వాడు సన్న్యాసి కాడు గదా! ముసలివాడు కాడు గదా! రోగగ్రస్తుడు కాడు గదా! అసమర్థు డంతకంటే కాడు గదా! అని శంకించడం బుద్ధిలోపం వల్ల, చెప్పేవాళ్లు లేకపోవడం వల్లనూ. కళ్లున్న ప్రతివాడికి వెలుగుతో అవసరమున్నట్లే జన్మ ఎత్తిన ప్రతివాడికీ సమస్యలుంటాయి కాబట్టి, వాటిని అధిగమించాలంటే తనలో ఉన్నలోపాన్ని తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. తన స్వరూపం ముందు అర్థం చేసుకొని, తను ఏ పొరపాటు చేయడం వల్ల ఈ సమస్యలుత్పన్న మౌతున్నాయో తెలుసుకో గలిగితే, ఆ సమస్యలను సులభంగా పరిష్కరించుకోవచ్చు. సమస్యే తెలియకపోతే దాని పరిష్కారం వాడివల్లేమౌతుంది అందుకని సమాజంలో జీవించే ప్రతి వాడికీ తారసపడే సమస్యలకు భగవద్గీత ఏం పరిష్కారం చెబుతుందని, ఈ దృష్టితో భగవ ద్గీతను చదవడం మొదలుపెట్టాను. నాకు తోచిన భావాలను అక్కడక్కడా ఉపన్యాసాల్లో చెప్పాను. చాలా మందికి ఈ కోణంలో ఇలా సర్వజనహితంగా భగవద్గీతను అన్వయిం చడం నచ్చింది. అనేకరకాలుగా, అనేక సందర్భాల్లో మిత్రులు చాలామంది ప్రోత్సాహాన్ని చ్చారు. తరువాత ఒక చక్కని ప్రణాళికను రూపొందించుకున్నాము. దాని ప్రకారమే ఈరచన సాగింది.

6. 1. మన సమస్యలకు భగవద్గీత పరిష్కారాలు :— భగవద్గీతలో ఉన్న స్పష్టమైన కొన్ని సిద్ధాంతాలు ఎవరికో వేదాంతులకు మాత్రంగాక సామాన్యమానవుడి జీవితంలో ప్రతిదినం, వాడు ఎదుర్కునే సమస్యలకు చక్కని పరిష్కారాన్నందిస్తాయి. మహా పురుషులు, మహాత్ముల జీవితాలను పరిశీలిస్తే క్లిష్టసమస్యలు సంభవించినప్పుడు వారు భగవద్గీతను పరిష్కారసాధనంగా తీసుకున్నట్లు కనబడుతుంది మానవులకు

మౌలికమైన సమస్యలు సమానమైనవే కాబట్టి, అవి అందరికీ పరిచితమైనవే అయి ఉంటాయి. కనుక భగవద్గీతను అధ్యాయక్రమాన్ననుసరించి చదివినవారికి ముఖ్యంగా తోచే సిద్ధాంతాలనే ఈ పుస్తకంలో ఎన్నుకొని అవి ఏ సమస్యలనెలా పరిష్కరిస్తాయో! ఏ సంశయాలకు ఎలా సమాధానాలౌతాయో మచ్చుకు కొన్నింటి నిలా నిరూపించాను. ఇలాంటి ఇతర సమస్యల నెన్నింటినైనా భగవద్గీతద్వారా మనం పరిష్కరించుకోవచ్చు. అసలు భగవద్గీత చదవనివారు ఈ రూపంగా అన్ని అధ్యాయాల్లో ఉన్న ముఖ్యశ్లోకాలను ఒకసారి చదివినట్లౌతుంది. సమాజంలో ప్రతివృత్తిలో ఉన్న వారికీ ఇది ఉపయోగపడాలనేదే నా లక్ష్యం. బాహ్యప్రపంచం గారడీలో పల్టీలు కొడుతున్న మనకు, మనలోపలి ప్రపంచం అందుబాటులోకి రావాలనీ, మన లోపాలు అర్థం కావాలనీ, ఈ పద్ధతిలో ఈ రచనను చేశాను. అందరికీ సులభంగా ఉండాలనే వ్యావహారిక భాషనే ఉపయోగించాను. ఇందులో చెప్పబడిన సమస్యలు పరిష్కారాలు ఏ మతంలో వారికైనా కావలసినవే కాబట్టి వాటినర్థం చేసుకొని ఇంద్రియ నిగ్రహంతో, మనోనిగ్రహంతో, ఆత్మగుణాలతో, కర్మయోగంతో జీవనాన్ని సాగిస్తే ప్రతివాడు ఆదర్శ ప్రవృత్తికల మానవుడుగా రూపొందుతాడు. పరిపూర్ణుడౌతాడు. సమాజంలో విరాట్స్వరూపాన్ని సాక్షాత్కరింప జేసుకో గలుగుతాడు. అందుకు ఏ కొంతమందికైనా నా యీ ప్రయత్నం వెలుగు చూపగలిగితే నేను కృతార్థుణ్ణి.

ఈ పుస్తకం వ్రాతప్రతిని చూచినంతనే ఆప్యాయతతో "మాకివ్వండి" అని తీసుకొని తి. తి. దేవస్థానాల తరఫున ప్రచురించిన తి. తి. దే. కార్యనిర్వహణాధికారి, భారతీయసంస్కృతి పరిరక్షణ బద్ధదీక్షులు, మంచితనానికి మారుపేరైన శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. ఎస్. గారికి, నా హార్దమైన కృతజ్ఞతా కుసుమాంజలి.

ఈ పుస్తక రచనాకాలంలో నాకు ఎంతో సహాయంగా ఉండి, శ్లోకసూచిని తయారుచేసి ఇచ్చిన ప్రియశిష్యులు శ్రీ సాంప్రతి సురేంద్రనాథ్ (Asst Manager Syndicate Bank.) గారికి నా ఆశీస్సులు.

ఈ పుస్తకాన్ని సుందరంగా ముద్రించిన శ్రీ ఎమ్. విజయకుమార్‌రెడ్డి (Manager, T. T. D. Press) గారికి, వారి సిబ్బందికి నా శుభాకాంక్షలు.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన"

గీతాజయంతి,
4-12-1979.

ఎస్. బి. రఘునాథాచార్య

# ఇందులో సమస్యలు ...

మన సమస్యలకు

# భగవద్గీత

## పరిష్కారాలు

1. సమస్య : ఎన్నో ప్రయత్నాలు చేశాను. కానీ ఏ విషయంలోను సత్ఫలితం కలగలేదు. మనస్సును నిరుత్సాహం ఆవరించింది. ధైర్యం సన్నగిల్లింది. ఏపని చేయాలన్నా ఏదో భయం! మంచి జరగదేమో! నని. చాలా కుంగి పోయాను. ఏం చేయాలి?

క్లైబ్యం మాస్మ గమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥ 3-2

పరిష్కారం: నిరుత్సాహపడ కూడదు నీలో ఉండే శక్తి నీకు తెలియదు. ఎన్నో మంచి విజయాలను సాధించిన నీవా ఇలా కుంగిపోయేది? ధైర్యం తెచ్చుకో. నీచమైన పిరికితనాన్ని వదలిపెట్టు. ఉత్సాహంతో దైవంమీద భారంవేసి నీ కర్తవ్యాన్ని నిర్వహించడానికి నడుం కట్టు. తప్పక లక్ష్యాన్ని సాధిస్తావ్

2. జీవితంలో జరిగే ప్రతి సంఘటనకు నేను మానసికంగా ఎంతో బాధపడతాను. వారు నాకు ఉపకారులైనా అపకారులైనా వారిని గురించి నాకెందుకో విపరీతమైన ఆవేదన. చనిపోయిన వారిని గురించి పోయారని బాధ. ఉన్నవారు సరిగా లేరే అని బాధ. ఏమిటి దీనికి పరిష్కారం?

అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః॥ 11-2

నీది కేవలం మానసిక దౌర్బల్యం. ఎవరిని గురించి నిజంగా బాధపడాలో ఎవరిని గురించి బాధపడక్కరలేదో నిర్ణయించుకోలేక పోతున్నావు. వివేకంగల వాళ్లెవరు చచ్చి

పోయిన వాళ్లని గురించిగాని బ్రతికి ఉన్నవాళ్లని గురించిగాని బాధపడరు. ఎందుకంటే లోకంలో ప్రతివాడు వాడి పుణ్యపాపాలను అనుభవిస్తుంటాడు. ఇతరులు బాధపడినంత మాత్రాన వాడి సుఖదుఃఖాల్లో ఏ మార్పూ రాదు. అది దైవలీల. కనుక నీవు ఏదో సాధిద్దామని బాధపడటం తప్పు.

3. అతను నాకు చాలా ఆప్తుడైన మిత్రుడు. వేమాహించలేదు. అనుకోకుండా అతడు గతించాడు ఎంత ప్రయత్నించినా మరచి పోలేక పోతున్నాను. ఏమిటీ జీవితం? ఏమిటీ జననమరణాలు?

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాన్తరప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి॥ 13-2

అతడు నావాడంటున్నావు. అందుకే నీకంత బాధ. ఈలోకంలో ఎవరికీ ఎవరూ తనవారూ కాదు పరాయివారూ కాదు. అదంతా మనం పెంచుకున్న అనుబంధం. అసలు మరణమంటే ఏమిటో ఎప్పుడైనా ఆలోచించావా? మనకు జీవితంలో ముందు బాల్యం వస్తుంది; కొన్నాళ్ళకు అది గడచి యౌవనం ప్రారంభమౌతుంది. నేను యువకుణ్ణి అనుకుంటుండగానే ముసలితనం వచ్చేస్తుంది. బాల్యం పోయిందని బాధపడుతున్నావా? లేదు. అలాగే నీ ఆత్మ ఈశరీరంలో కొన్నాళ్లుండి ఇంకో శరీరంలో ప్రవేశిస్తుంది. అదీ శాశ్వతం కాదు. కొంతకాలం తరువాత దాన్ని వదిలిపెడుతుంది. 'ఈ శరీరం వాది' అనుకుంటాడు జీవుడు. అందుకే మరణమంటే భయం. చచ్చిపోయినాడంటే బాధ. మిత్రుడు వేరే ఊరు వెళ్లాడంటే బాధపడతామా? ఇదీ అంతే. అయితే బాధపడకుండా ఉండాలంటే ఆ దృష్టి కావాలి.

4. ఎండాకాలంలో విపరీతమైన తాపం. అప్పుడు చల్లగా ఉండాలనిపిస్తుంది. వర్షాకాలంలో అతివృష్టి బాధ. చలికాలంలో తీవ్రమైన చలి. వెచ్చగా ఉండాలనిపిస్తుంది. ఏకాలం చూచినా బాధాకరంగానే ఉన్నది. వీటివల్ల నాజీవనసరళిలో చాలా ఒడుదుడుకులు కలుగుతున్నాయి. వీటి నుంచి బయటపడాలి. ఏమిటి మార్గం?

మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణసుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యాస్తాం తితిక్షస్వ భారత॥ 14-2

ఇవన్నీ తాత్కాలికాలు. ఏవీ శాశ్వతాలు కాదు. వీటినించి నీవెలాగూ తప్పించుకోలేవు. కనుక వీటిప్రభావం నీ మనస్సుమీద పడకుండా ఓర్పుతో మసలాలి.

కొంచెం ఓపిక పట్టావంటే ఇవన్నీ గాలిలో మేఘాల్లాగా అదృశ్యమౌతాయి. కనుక మనస్సును నిగ్రహించుకో!

5. ఈ శీతోష్ణసుఖదుఃఖాదిబాధలకు గురికానివారు కూడా ఉంటారా? వారేనా నిజంగా మోక్షానికి అర్హులు?

యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥ 15-2

తప్పకుండా ఉంటారు. అల్లాంటి వాళ్లనే ధీరులంటారు. వారికి వీటి స్వరూపం బాగా తెలియడం వల్ల ఇవి వచ్చేపోయేవని గ్రహించి వీటిని లెఖ్ఖ చెయ్యరు. లెఖ్ఖ చేయని వారిని ఇవి ఏమీ చేయలేవు. లొంగి పోయావో కుంగదీస్తాయి. అలా వీటికి ఎన్నటికీ లొంగని వారికే మోక్షం లభిస్తుంది.

6. చనిపోయిన వెంటనే శరీరం బూడిదై మట్టిలో కలుస్తుంది కదా! ఎందుకు జీవితంలో మంచిని చేయాలి? దేనికి మంచి మార్గంలో నడవాలి? శరీరంకంటే వేరైనది, శాశ్వతమైనది ఏదైనా 'ఆత్మ' అనేది ఉన్నదా? ఈ శరీరంమీద మోజుపెంచుకోవడం మంచిదా?

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥ 18-2

శరీరమనే ద్వానికే నశించిపోయేది అని అర్థం. అలాంటి దానిమీద మోజు పెంచుకోవడం మంచిపని ఎలా అవుతుంది? శరీరం మట్టిలో కలసినా శాశ్వతంగా ఉండే ఆత్మ ఉన్నది కాబట్టి, మనం మంచినే చేయాలి. మనం చేసే ప్రతికర్మవల్లా మనకు పుణ్యపాపాలు కలుగుతాయి. కనుక మనం మంచి పనులే చేయాలి. మంచి మార్గంలోనే తప్పక నడవాలి. శరీరం పోయినా ఆ పుణ్యపాపాలు ఆత్మను వదలవు. వాటి ఫలితాలైన సుఖదుఃఖాలను ఆత్మ అనుభవిస్తేగాని అవి నశించవు. కనుక శాశ్వతమైన ఆత్మకు నశించేటువంటి శరీరాలతో సంబంధం కలగడమే జీవితమని తెలుసుకోవాలి.

7. లోకంలో ఒకడివి ఇంకొకరు చంపుతున్నట్లు వ్యవహారం ఉంది కదా! ఇది నిజమేనా? ఆత్మ చచ్చిపోవడంకాని, ఇతరులు దాన్ని చంపడంకాని కుదురుతుందా?

**య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।**
**ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥ 19-2**

లోకంలో ఎన్నోరకాల వ్యవహారాలున్నాయి. అవి అన్నీ సత్యానికి దగ్గఱగా ఉండవు. అన్నీ అసత్యాలూ కాదు. 'వాడిని వీడు చంపాడు' అంటుంటాం. అక్కడ మనదృష్టిలో వాడంటే ఆ పేరుతో చెప్పబడే శరీరం. ఇది శరీరాత్మ భ్రాంతివల్ల ఏర్పడిన భావన. అలాగె 'వీడు చచ్చిపోయాడు' అని మనం అంటే శరీరమే వీడనే దృష్టితో అన్నామన్న మాట. కాని ఆత్మ చంపేది కాని, చచ్చేది గాని కాదు. సుకృత దుష్కృతాల ననుభవించిన జీవుడు ఈ శరీరాన్ని వదలి ఇంకో శరీరంలో ప్రవేశించడానికి ఏదో ఒక నిమిత్తం కావాలి కాబట్టి వాడు చంపాడనో! లేక ఇంకేదో మనం చెపుతుంటాం. ఆత్మను చావులేదు.

8. లోకంలో, మానవుడు పుడుతున్నాడని, చనిపోతున్నాడనీ, అంటుంటాం కదా! ఆత్మ నిత్యమే అయితే పుట్టడమేమిటి? చావడమేమిటి? చావుపుట్టుకలు ఆత్మ కుండవా? లేక ఆత్మ కూడా అనిత్యమేనా?

**న జాయతే మ్రియతే వా కదాచిత్**
**నాయం భూత్వా భవితా వా న భూయః।**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే॥ 20-2**

చావు పుట్టుకలు శరీరానికే గాని, ఆత్మకు కాదు. శరీరంనుంచి ఆత్మ విడిపోవడమే మరణం. శరీరంలో ఆత్మ ప్రవేశించడమే ఉత్పత్తి ఆత్మ నిత్యం గనుక పుట్టదు నశించదు. అంటే ఎప్పుడూ ఉంటుంది. కనుకనే దీన్ని పుట్టనిదని, నిత్యమైందనీ, శాశ్వతమైందనీ, పురాణమైందనీ చెపుతారు. శరీరానికి చావు సంభవించినా ఆత్మకు చావు లేదు.

9. సన్నిహితవ్యక్తి గతించారు. అతనిమీది ప్రేమాభిమానాల్ని నేను మరచిపోలేక పోతున్నాను. నామనస్సెలా సమాధానపరచుకో వాలి? మరణమంటే ఏమిటి?

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ 22-2

ఎవరు దగ్గఱవారు? ఎవరు దూరపు వారు? ఈ దగ్గఱ దూరాలన్నీ మనం కల్పించుకున్నవి. మీ మనస్సును మీరు నిగ్రహించుకోవాలి. మనం కొత్త బట్టలు కట్టుంచుకుంటాం. కొన్నాళ్లు వాడుకుంటాం. అవి చినిగి పాతవౌతాయి. వాటిని వదిలేసి మళ్లా కొత్తవాటిని తొడుక్కుంటాం. ఆత్మకూడా అలాగే ఒక శరీరంలో ప్రవేశించి కొన్నాళ్లుండి అది శిథిలమైతే, దాన్ని వదిలి వేఱొకదానిలో ప్రవేశిస్తుంది. వీటినే జననమరణాలు అన్నాం.

10. మన శరీరాన్ని పృథివి, జలం, తేజస్సు, వాయువు ఏమైనా చేయగలవు. అందుకే మనం ఈ భూతాలకు భయపడిపోతాం. మఱి ఆత్మకూడా అంతేనా? లేక శరీరానికి ఆత్మకు తేడా ఉందా?

నైనం ఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః॥ 23-2
అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః॥ 24-2

శరీరానికి ఆత్మకు పోలికే లేదు. శరీరాన్ని పంచభూతాలు ఏమైనా చేయగలవు. కాని ఆత్మను ఏమీ చేయలేవు. శస్త్రాలు శరీరాన్ని నరికివేస్తాయి, ఆత్మను ఖండించలేవు. నిప్పు శరీరాన్ని బూడిద చేసివేస్తుంది, కానీ ఆత్మను అంటుకోలేదు. నీళ్లు శరీరాన్ని తడిపి వేయగలవు, కానీ ఆత్మనేమీ చేయలేవు. గాలి శరీరాన్ని ఎండించగలదు, ఆత్మనేమీ చేయ లేదు. కనుక మన ఆత్మ నరకడానికి వీల్లేనిది, తగులబెట్టడానికి వీల్లేనిది, తడపడానికి వీల్లేనిది. ఎండించడానికి వీల్లేనిది. ఇది నిత్యం. అంతటను ఉంటుంది. స్థిరం, అచలం, సనాతనమై ఉంటుంది. కనుక దీని దగ్గఱ బాహ్యభూతవికారాలు పనిచేయవు.

11. పుట్టిన ప్రతివాడూ చనిపోక తప్పదా ? చనిపోయినవాడు మళ్లా పుట్టకుండా ఉండగలడా? మరి 'అయ్యో! నావాడు పోయి నాడే!' అని మనం బాధపడటం మంచిదా ?

**జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ।**
**తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి॥ 27-2**

పుట్టడమనే లక్షణంగల ప్రతిదీ చనిపోక తప్పదు. అందుకనే దాన్ని అనిత్యమంటాం. పుడుతున్న వ్యక్తులు, వస్తువులు నశించడం మనం ప్రత్యక్షంగా చూస్తున్నాం. చనిపోయిన వాడు మళ్లా పుట్టక తప్పదు. మోక్షం పొందితేనే మళ్లా జన్మ ఉండదు. పునర్జన్మ సిద్ధాంతాన్ని అంగీకరించడానికి మనకే ఇప్పుడు సాక్ష్యాధారాలు అన్ని దేశాల్లోను దొరుకు తున్నాయి. కనుక ఈ శరీరం వదలి ఇంకొచోట పుట్టేవాడిని గురించి బాధపడడం అవివేకమే కదా! ఔతుంది.

12. ఎవరైనా చనిపోయినారని వినడంతోనే లోకం ఆశ్చర్యపడు తుంది. ఆత్మను ఆశ్చర్యంగా చూస్తుంది. ఆశ్చర్యంగా చెప్పు కుంటుంది. ఎన్ని సార్లువిన్నా ఇంకా వింతగా వింటూనే ఉంటుంది. కానీ దీని స్వరూపస్వభావాలు ఏ ఒక్కరికి అంతుబట్టవు. మళ్లా లోకవ్యవహారాల్లో మునిగిపోయి మర్చిపోతుంది. అజ్ఞానంలో పడిపోతుంది. ఏమిటీ చిత్రం ?

**ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనం**
**ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।**
**ఆశ్చర్యవచ్చైన మన్యః శృణోతి**
**శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్॥ 29-2**

అవును! ఇది నిజంగా ఆశ్చర్యాలకే ఆశ్చర్యమైన వస్తువు. లోకంలో ప్రతివ్యక్తికీ దిగ్భ్రాంతిని కలిగించే పదార్థం ఇది. మరణించాడంటే ప్రతివాడికీ ఆశ్చర్యం. తాత్కాలికంగా కలిగినా సత్త్వరజస్తమోగుణమయమైన మాయలో పడిపోతాడు మానవుడు. దాంతో జ్ఞానం నిలవదు. అజ్ఞానం ఆవరిస్తుంది. అందుకనే అడుగడుగునా ఆశ్చర్యపడుతుంటాడు.

13. అధర్మం పెరిగిపోయింది. చుట్టుపక్కలవారు అకారణంగా వైరాన్ని పెంచుకొని తాము చీకాకు పడటంతోపాటు లోకాన్ని కూడా చీకాకు పెడుతున్నారు. నన్ను అధర్మంగా ఎదుర్కొంటున్నారు. ఆ స్థితిలో ఏం చేయాలి? సరిదిద్దవలసిన బాధ్యతను వదలి భయపడి పారిపోవడమా? లేక ధైర్యంతో నిలబడి నా బాధ్యతను నిర్వహించడమా? ఏమిటి కర్తవ్యం?

స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే॥31-2

[illegible] ధర్మాన్ని పూర్తిగా ఆకళించుకొ[illegible] ఏ పరిస్థితిలోను వెనుకాడకు. [illegible] విశ్వాసం నీలో పరిపూర్ణంగా ఉంటే అధర్మ[illegible]ంటున్న వారిని ప్రతి[illegible]. వెనుకాడకు. బాధ్యతను చూచి వెదిరి పారిపోకు. ధర్మంగా నీవు చేసే ప్రతిఘటనలో తప్పక నీవు విజయాన్ని పొందుతావు. నీస్వార్థంకంటే నీబాధ్యతకు, పరోపకారానికి ప్రాధాన్యత నివ్వు. ఆదర్శ జీవనం చేయగలుగుతావు.

14. మొదట్నుంచి నేను చాలా ఆదర్శాలతో జీవించాను. ధర్మంగా నడిచాను. ధర్మమార్గాభ్యుదయానికి, సమాజశ్రేయస్సుకు కృషి చేశాను. పేరుప్రతిష్ఠలు సంపాదించాను. క్లిష్టపరిస్థితి వచ్చింది. ఇప్పుడు నిలబడలేనేమో! ధర్మాన్ని తప్పుతానేమో! ఆదర్శాన్ని పోగొట్టుకుంటానేమోనని భయం. ధర్మాన్ని తప్పి అప్రతిష్ఠను భరించడమా? లేక ధైర్యంగా పరిస్థితిని ఎదుర్కోవడమా?

అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్।
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే॥ 34-2

నీవు ఇంతవరకు జీవితంలో సంపాదించిన పేరుప్రతిష్ఠలు ఒక ఎత్తు, [illegible] ర్శాలను కోల్పోయి, ధర్మం తప్పినవాడని పొందే అప్రతిష్ఠ ఒక ఎత్తు. నీకున్న పేరుప్రతిష్ఠలను ప్రజలు గుర్తిస్తారో లేదో కాని, నీకు ఇపుడు కలిగే అపకీర్తిని మాత్రం అందరు తప్పక గుర్తు పెట్టుకుంటారు. ఒకసారి జీవితంలో చక్కని గౌరవం పొందినవాడు తిరిగి అగౌరవం

పొందడం మరణంకంటే నీచమైన విషయం. అది చాలా బాధాకరం. కనుక ధర్మాన్ని తప్పకు. అప్రతిష్ఠపాలు గాకు. ధైర్యంగా పరిస్థితిని ఎదుర్కో.

15. నేను చాలా ఇబ్బంది పడుతున్నాను. ఏ పని చేద్దామన్నా ముందు నుయ్యి వెనుక గొయ్యిలాగా వ్యతిరేకంగా ఉన్నాయి పరిస్థితులు. బాధ్యత వదలి బెదిరి పారిపోవడమా? లేక ఫలితం ఏమైనాసరే ధైర్యంతో కర్తవ్యనిర్వహణం చేయడమా? అన్నది సమస్య. జీవన్మరణ సమస్య. మరి దీన్నెలా పరిష్కరించడం?

**హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్।**
**తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః॥ 37-2**

నీ మనస్సును దిటవు చేసుకో. బాధ్యతను వదలి పారిపోయినంత మాత్రాన సమస్యా పరిష్కారం ఎలా జరుగుతుంది? నీ సుఖప్రారబ్ధం సుఖాన్ని, దుఃఖప్రారబ్ధం దుఃఖాన్ని నీ సలహా సంప్రతింపులు లేకుండా ఇవ్వడానికి కాచుకొని ఉన్నాయి. కనుక నీ కర్తవ్యాన్ని నీవు ధైర్యంతో నిర్వహించు. దైవానుకూలత ఉంటే కృతార్థుడవౌతావు. అలా కాకపోయినా న్యాయంగా కర్తవ్యాన్ని చేసినవాడవౌతావు. కాలమే పరిస్థితుల్ని చక్కబరుస్తుంది.

16 'నేనొకపని చేయబోతున్నాను. లాభమొస్తుందో! రాదో! అని' 'విజయం లభిస్తుందో! అపజయం కలుగుతుందో! అని', దానివల్ల సుఖం కలుగుతుందో! దుఃఖమే సంభవిస్తుందో అని, మనస్సులో ఒకే ఆందోళన. ఎన్నో జాగ్రత్తలు తీసుకున్నాను. తప్పుడు మార్గాలను అనుసరింపక తప్పదా? నా ఆలోచన ఎలా ఉండాలి? నే నెలా నడుచుకోవాలి? ఏది శాంతిప్రదమైన మార్గం?

**సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।**
**తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥ 38-2**

నీ ఆందోళనవల్ల విజయం లభించదు. ఆందోళనతో నీవు కర్తవ్యాన్ని సరిగా నిర్వహింపలేకపోవచ్చు. నీ వనుభవించవలసిన ఫలితం నీ కోసం కాచుకొనే ఉంది. అది ఎలాగూ నిన్ను వరిస్తుంది. దానికోసం నీవు తప్పుడుమార్గాలను అనుసరించనక్కరలేదు. సుఖ-దుఃఖాలను, లాభనష్టాలను సమానంగానే భావించు. ఏది వచ్చినా సంతోషంగా భగవత్ప్ర

పాదమనే భావనతో అనుభవించడానికి సిద్ధంగా ఉండు. దీనివల్ల నీలో రాగ-ద్వేషాది దోషాలు పెరిగి పాపాలుచేసే ప్రమాదంనుంచి తప్పుకుంటావు. కర్తవ్యం మఱి నీవంతు.

17. నేను చేయాలనుకున్న పనివిషయంలో ముందు ఒకనిర్ణయం చేసుకున్నాను. మళ్ళా ఆలోచించి అది బాగాలేదని నిర్ణయం మార్చుకున్నాను. స్నేహితులంతా మంచిఫలితం రాదన్నారు. ఏమౌతుందోనని లోపల ఆందోళన. ఏం చేయాలి? ఇలా నిర్ణయాలు ఎంతకాలం మారుస్తూండడం? అది మంచిదనేనా?

> వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునన్దన।
> బహుశాఖాహ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥ 41-2

దేశ-కాల-పాత్రాలను దృష్టిలో పెట్టుకుని చక్కగా విచారించి ఒక నిశ్చయానికి రావాలి. నిర్ణయం తీసుకున్న తరువాత సామాన్యంగా ఎవరు సలహా చెప్పినా మళ్లా, మళ్లా మార్చడానికి ప్రయత్నించకు. అలా మారుస్తూ పోతుంటే నీలో ఆత్మవిశ్వాసం సన్నగిల్లుతుంది. అంతేకాదు ఇకముందు నీకెవరూ సలహాకూడా చెప్పరు. పరిపరి విధాల ఆలోచిస్తూ చివఱకు నీవేపనీ సాధించలేవు. కనుక స్థిరసంకల్పాన్ని అలవరచుకో. విజయం లభిస్తుంది.

18. నా ప్రయత్నాలకు సత్ఫలితాలు కలిగాయి. సాధించానని అహంభావం నాలో అంకురించింది. ప్రయత్నాలు విఫలమైనాయి. ఎంతో బాధకలిగింది. జన్మే వ్యర్థమనిపించింది. దైవాన్ని లోకాన్ని నిందించాను. ఇంకా ఏ ప్రయత్నం చేయనే కూడదనుకున్నాను. నా ఆలోచన మంచిదేనా?

> కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
> మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి॥ 47-2

మీ ఆలోచన సరైందికాదు. సత్ఫలితాలకు కాని దుష్ఫలితాలకుగాని మీ ప్రయత్నాలు మాత్రమే కారణమనుకోకండి. పనులు జరిగితే ఉబ్బి తబ్బిబ్బులు కావడం, అహంకారపడటం, లేక పని జరగకపోతే, నిలువునా కుంగిపోవడం మిమ్ములను నిందించుకొని దేవుణ్ణి, లోకాన్ని దూషించడం మీ బలహీనత. 'ఫలితం వస్తుందా? రాదా?' వస్తే ఏం వస్తుంది? అనే ఆలోచనలు లేకుండా మీ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించడం

పలికే మీ ధర్మం. ఫలప్రాప్తి మీచేతుల్లో లేదు. కనుక ఫలితాన్ని ముందే ఆశించకండి. అట్లా అని మీకర్తవ్యం వదిలి, కర్మరహితులై సోమరులు కూడా కాకూడదు. మీకివ్వవలసిన ఫలితాన్ని మీ ప్రారబ్ధాన్ననుసరించి భగవంతుడెలాగూ ఇస్తాడు. ఇలాంటి భావనతో కర్మల నాచరిస్తే మీకు శాంతి ఉంటుంది. సమాజానికి మీవల్ల ఇబ్బంది ఉండదు.

19. ప్రయత్నానికి ముందే 'ఎంత ప్రయోజనం కలుగుతుంది?' అని అంచనాలు వేసికొని పనిలోకి దిగడం అలవాటు. ఎందువల్లనో ఈ మధ్య ఏపని మొదలుపెట్టినా మంచి జరగడంలేదు. దాంతో చాలా భయం కలుగుతోంది. ఎందుకులే ప్రయత్నించడం అని నిరుత్సాహం. ఏదో చెప్పలేని ఆందోళన. అన్నింటివల్ల నాలో అసమర్థత బాగా పెరిగింది. ఏమిటి పరిష్కారం?

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥ 48-2

మీ సంకల్పంలోనే పొరపాటుంది. ఏదో పెద్ద ప్రయోజనాన్ని కోరి మీరు పని మొదలు పెడుతున్నారు. దైవం అనుకూలించని ఫలితం కలక్కపోతే వెంటనే మీరు తల్లకిందులై పోతున్నారు. నిరుత్సాహపడిపోతున్నారు. ఆందోళన పొందుతున్నారు. ఇప్పుడైనా గ్రహించారా? ఫలాపేక్ష వీటికన్నింటికి కారణం. ఫలసిద్ధి కలిగినా కలగకపోయినా, రెండింటి విషయంలో సమభావనతో కర్మలాచరించాలి. ఆ సమభావనే యోగమంటారు. సమభావనతో వ్యవహరించే వారికి ఫలాసంగం ఉండదు. వారికి పుణ్యపాపాలు అంటవు.

20. ఎన్నోపనులు చేస్తుంటాం. కొన్ని సరిగా చేస్తాం. ఇంకొన్ని సరిగా చేయలేం. లోపల దడుపుగా ఉంటుంది. ఈపని వల్ల పుణ్యం వస్తుందో, పాపమే వస్తుందోనని. మంచి చేస్తున్నానో లేక చెడ్డ చేస్తున్నానో అని లోపల సంశయం. వీటితో ఏ పనీ చేయలేక పోతున్నాను. నేనెలా భావించాలి? ఎలా ఆలోచించాలి? ఏది మంచి మార్గం?

**బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే।**
**తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥ 50-2**

ఫలాకాంక్షలేకుండా, కార్యసిద్ధి కలిగినా కలక్కపోయినా దైవానుగ్రహమని సమాన

భావనతో స్వీకరించడానికి సిద్ధపడి ఏ పనినైనా చేయాలి. ప్రతి పనినీ ఇలా చేయడానికి అలవాటుపడితే, ఫలాంశాన్ని భగవంతునికి వదిలివేయగలిగితే బాధ్యత మనపైన ఉండదు. మనస్సు నెమ్మదిగా ఉంటుంది. ఏరకమైన పుణ్యపాపాలు మనకంటవు. కనుక ఈ భావనను పెంపొందించుకొని ప్రయత్నాలు చేయడం నేర్చుకోండి. కర్మలనాచరిస్తూ కూడా ఫలాపేక్ష లేకుండా సమానభావనతో ఉండటం, పుణ్యపాపసంబంధం లేకుండా చేసుకోవడమే నేర్పరితనం. దీన్నే యోగమంటారు. ఇలాంటి భావన మీకుంటే మీరు ఏ పనైనా ధైర్యంగా చేయవచ్చు.

21. నా మనస్సే నాకొక సమస్యై కూర్చుంది. కొంచెం బాధ కలిగిందంటే తల్లకిందులైపోతాను. కొంచెంకూడా తట్టుకోలేను. ఆ సుఖం నాకు లేదే! ఈ సుఖం నాకు లేదే! అని ఒకటే ఆరాటం. కోరికోరి శ్రమతో వస్తువులను సంపాదించాను. అవి పోతాయేమోనని భయం. ఎవరైనా అవి కావాలంటే వారిపై క్రోధం. కొంచెం మంచి కలిగితే దాన్ని గొప్పగా చెప్పుకుంటాను. కొంచెం చెడు కలిగితే లోకాన్ని ద్వేషిస్తాను. నేనెలా ఉండాలి?

దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే॥ 56-2

యస్సర్వత్రానభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57-2

మన మనస్సు మనం చెప్పినట్లు వింటే ఇక లోకంలో జయించలేనిదేదీ ఉండదు. అది అభ్యాసంతో రావాలి కాని ఒకపట్టున సమకూరేది కాదు. మీ మనస్సు మీ చెప్పుచేతల్లో లేదు కాబట్టి మీరు సుఖం కలిగినా దుఃఖం కలిగినా తల్లడిల్లిపోతున్నారు. ఆరాటం, భయం మీలో తిష్ఠవేశాయి. ఎన్ని దుఃఖాలు కలిగినా మనస్సు సంక్షోభాన్ని పొందకూడదు. సుఖాలు కలిగినప్పుడు కొంచెం ఒళ్లు దగ్గఱపెట్టుకోవాలి. భయాన్ని, రాగద్వేషాలను దగ్గఱకు కూడా రానీయకూడదు. ఏ విషయంలోనూ విపరీతమైన రాగం ఉండకూడదు. అలా ఉండటానికి అభ్యాసం చేస్తే మంచి జరిగినా, చెడు జరిగినా వాటి ప్రభావాలు మీమీద పడవు. వాటిని మీరు పొగడటం లేక ద్వేషించడం జరగదు. మీరు స్థితప్రజ్ఞులౌతారు.

22. ఎవరైనా మంచిమాటలు చెప్పినప్పుడు అలాగే ఉండాలని నిర్ణయించుకుంటాను. కాని మళ్లా ప్రపంచంలో అన్ని భౌతికాకర్షణలను నా పంచేంద్రియాలు తీవ్రంగా గురౌతున్నాయి. తట్టుకోలేక పోతున్నాను. నేనీ విషవలయంలోంచి ఎలా బయటపడాలి?

యదా సంహరతే చాయం కూర్మోంగానీవ సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 58-2

మీ ఇంద్రియాలు లోకంలో ఉన్న శబ్ద, రూప, రస, గంధ, స్పర్శలనే భౌతిక విషయాలను దాస్యం చేస్తున్నాయి. మీ మనస్సు వాటికి దాసోహమంటున్నది. అందుకే మీరీ విషవలయంలో పడ్డారు. తాబేలు తన అవయవాలను డొరునులోపలికి ముడుచుకున్నట్లు మీ ఇంద్రియాలను పై విషయాల జోలికి పోకుండా ముందు మరల్చండి మీకు స్థిరబుద్ధి కలుగుతుంది. మీరు స్థితప్రజ్ఞులౌతారు.

23. నా మనస్సును ఇంద్రియాలబారిన పడకుండా కాపాడుకోవటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాను. ఎన్నో శాస్త్రాలు చదివాను. ఎంతో జ్ఞానాన్ని సంపాదించాను,గదా! అనుకున్నాను. కానీ నా ఇంద్రియాలు ఉన్నట్టుండి మనస్సును కాస్తా వశపరచుకుంటున్నయ్. ఇది సాధ్యమా?

యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ 60-2

మీరు ఇంద్రియాలను నిరోధించకుండా మనస్సును నిగ్రహించడానికి ప్రయత్నం చేస్తే సఫలుడు కాలేరు. మనస్సు కన్నా ఇంద్రియాలు చాలా ప్రబలమైనవి. వాటికి జన్మాంతరాభ్యాసాలెన్నో ఉన్నాయి. వాటి దగ్గర మనస్సు చాలా దుర్బలమైంది. కనుక మీరు ఎన్ని శాస్త్రాలు చదివినా, ఎన్ని ప్రయత్నాలు చేసినా ప్రయోజనం లేదు. ముందు ఇంద్రియాలు విజృంభించకుండా చూసుకోండి. ఇంద్రియాలను మీరు జయించాలంటే ఉపవాసాదివ్రతాలు, ధ్యానం కావాలి. అప్పుడే మీకు ఇన్ద్రియజయం కలుగుతుంది. ఇక మీ మనస్సు మీరు చెప్పినట్లు వింటుంది. మన ఆచారవ్యవహారాలు, నియమ నిష్ఠలు, వ్రతాలు, ఉప

పాపాలు ఇవన్నీ ఇంద్రియజయం కోసం ఏర్పాటు చేయబడ్డవే. అందుకని రోగం ఎక్కడ పుట్టిందో అక్కడ మందు వేయండి.

21. నాకావ్యక్తితో పరిచయం కలిగింది. అది అలా అలా పెరిగింది. ఆవ్యక్తిని గూర్చి ఆలోచించకుండా ఉండలేక పోతున్నాను. కొన్నాళ్లు గడిచాయి. ఆ వ్యక్తి నాతోనే ఎప్పుడూ ఉంటే ఎంత బాగుండు, అనే కోరిక కలిగింది. ఆ వ్యక్తిపై ఇతరులకభిమాన మున్నట్లు తెలిస్తే చాలు ఒళ్లుమండేది. వాళ్లమీద ఎంతో ద్వేషం కలిగేది. నేనేదో పోగొట్టుకుంటున్నాననిపించేది. ఆ క్రోధంలో వెనుకటి స్నేహాన్ని మరచిపోయి ఎన్నో కానిమాటలు మాట్లాడాను. ఏంచేయాలో తెలియడంలేదు. అసలు ఇదంతా ఎలా సంభవించిందో అగమ్యగోచరంగా ఉంది. ఏమిటి కారణం?

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే॥ 62-2
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశః బుద్ధినాశాత్ప్రణశ్యతి॥ 63-2

లోకంలో మనం ఏ వ్యక్తులను గురించి లేక ఏ వస్తువులను గురించి ఎక్కువగా ఆలోచిస్తామో! పరిచయం పెంచుకుంటామో! వారి (టి) పై మనకు సంగం కలుగుతుంది. సంగమంటే ఆసక్తి ఆ ఆసక్తి బలపడితే కొన్ని కోరికలు పుడతాయి. అవి కొన్ని నెర వేరతాయి, కొన్ని విఫలమౌతాయి. దానివల్ల ఇతరులపై క్రోధం కలుగుతుంది. క్రోధం అజ్ఞానాన్ని పెంచి మనలో ఆవేశాన్ని రెచ్చగొడుతుంది. ఆవేశపరుడైనవాడు తనను తాను మరచిపోతాడు. మంచిచెడులు లేకుండా మాట్లాడి, చెడ్డ పనులు చేస్తారు. ఇప్పుడు మీ సమస్య స్వరూపం మీకర్థమైందనుకుంటాను. మీరు ముందే జాగ్రత్త పడి ఉంటే ఇన్ని ఇబ్బందులు వచ్చేవి కాదు. వ్యక్తులతో గాని వస్తువులతో గాని యోగ్యాయోగ్యవిచక్షణ లేకుండా మీరు పరిచయం కలిగించుకో కూడదు. అలా కలిగించుకుంటే మిగతావి కూడ తప్పవు. సమస్యకు మూలాన్ని అర్థం చేసుకోండి. పరిష్కారం మీ చేతుల్లో ఉంటుంది.

25. నాకు తెలియకుండానే ఎన్నో చిక్కుల్లో పడ్డాను. ఇప్పుడు గమ్యం శూన్యంగా ఉంది. బయటపడే మార్గమే కనపడటంలేదు. అసలు ఆలోచించే ఓపిక కూడా నాకు కరువైంది. కనపడ్డ మంచివస్తువల్లా నాకే కావాలనీ, నాఇష్టానికి అడ్డువస్తే అతణ్ణి సర్వనాశనం చేయాలనీ ఒకే ఆవేశం. నా మనస్సు నాకే అర్థం కావడంలేదు. ఏదో అశాంతి. ఏదో ఆదుర్దా. నాకెలా ప్రశాంతి లభిస్తుంది?

రాగద్వేషవిముక్తైస్తు విషయానింద్రియైశ్చరన్।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి॥ 64-2
ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి। 65-2

మీ చిక్కులకన్నింటికీ రెండే కారణాలు. ఒకటి రాగం. రెండవది ద్వేషం. ఈ రెండింటితోనే మీరు సతమతమౌతున్నారు. మీలో అశాంతి అలముకుంది. మనస్సును నిగ్రహించండి ఇంద్రియాలను స్వాధీనపరచుకోండి. రాగద్వేషాలు లేకుండా అనుకోకుండా లభించిన విషయ సుఖాలను మీరు పొందినా మనశ్శాంతికి కరువుండదు. ప్రసన్నమైన, నిర్మలమైన మనస్సుంటే అన్నిదుఃఖాలు వాటంతట అవే పోతాయి. ప్రసన్నమైన మనస్సు కలవాడికి స్థిరమైన బుద్ధి కలుగుతుంది. అప్పుడు మీలో ఆవేశాలకు, ఆదుర్దాలకు చోటుండదు. ఏది చేసినా చక్కగా ఆలోచించి చేస్తారు. రాగద్వేషాల ప్రభావం మీమీద లేదు కాబట్టి మీకు ప్రశాంతికి లోటుండదు.

26. తోచిన వెంటనే ముందువెనకలు ఆలోచించకుండా ప్రతిపనీ చేయడం నాకలవాటు. ఆలోచించి చేసే ఓపిక నాకు లేదు. ఒకప్పుడు విజయం లభిస్తుంది. పరాజయం చాలాసార్లు కలుగుతోంది. నాకు శాంతిలేదు, సుఖసంతోషాలు అంతకంటే శూన్యం. నేనెలా శాంతిని పొందుతాను? నాకు సుఖమెలా కలుగుతుంది?

నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా।
న చాభావయతః శాన్తిరశాన్తస్య కుతస్సుఖమ్॥ 66-2

మీలో సమబుద్ధి లేదు. కర్మకౌశలమూ లేదు. కనుక కార్యసిద్ధి కలిగినా కలుగక

పోయినా సమానంగా స్వీకరించే ఓర్పు, ఫలాపేక్ష లేకుండా, పుణ్యపాపసంబంధం లేకుండా, కర్తలనాచరించే నేర్పు బాగా పెరగాలి. అది మీ నిరంతరాభ్యాసంవల్ల కాని సాధ్యం కాదు. ఈ రెండూ లేనివాడికి ఏది మంచి? ఏది చెడు? అనే వివేకం ఉండదు. అటువంటి వానికి మంచి భావనలుండవు. ఇలా భావించని వాడికి మనశ్శాంతి కలగనే కలగదు. మనశ్శాంతి లేనివాడికి సుఖమెలా కలుగుతుంది? అందువల్ల మీరు సమబుద్ధిని, కర్మ కౌశలాన్ని అలవాటు చేసుకుంటే మీకు తప్పక సుఖసంతోషాలు కలుగుతాయి.

27. నా మనస్సు చాలా దుర్బలంగా ఉంది. దాన్ని నేను కట్టుబాటు చేసుకోలేక పోతున్నాను. ఇంద్రియాలు వాటివాటి విషయాల వెంట పరుగెడుతున్నాయి. మనస్సు ఇంద్రియాల వెంట పరుగెత్తు తోంది. మంచి చెడులను నిర్ణయించుకోలేక పోతున్నాను. స్థిరమైన ఏ నిర్ణయాన్ని తీసుకోలేక పోతున్నాను. అసలు జరపలేక పోతున్నాను. నేనేం చేయాలి?

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥ 67-2

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 68-2

మీ ఇంద్రియాలు స్వతంత్రంగా వాటికి వచ్చినట్లు ప్రవర్తిస్తున్నయ్. నిజానికి మీ మనస్సు వాటిని నిరోధించాలి. కానీ అలా నిరోధించకుండా వాటితో చేరిపోయింది మనస్సు. ఇంద్రియాలు భౌతికవిషయసుఖాలకు లొంగిపోయినాయి. చుక్కానిలేని నావను గాలి తన ఇష్టం వచ్చినట్లు ఏదో ఒక పక్కకు తిప్పినట్లు, ఇంద్రియాల వెంటబడ్డ మీ మనస్సు బుద్ధిని తన ఇష్టం వచ్చినట్లు తిప్పివేస్తున్నది. అందుకనే మీరు ఏదీ స్థిరంగా నిర్ణయించుకో లేకపోవడం, అసలు జరపలేకపోవడం ఏర్పడుతున్నది. కనుక మీరు భౌతిక విషయాలకు దాస్యం చేయకుండా ఇంద్రియాలను మరల్చి నిగ్రహించండి. మనస్సు దానంతట అదే దోవలోకొస్తుంది. అప్పుడే మీరు స్థితప్రజ్ఞులౌతారు.

28. సామాన్యంగా మనం ఊరకే ఉండటం మెలకువగా ఉన్నప్పుడు సంభవించదు. ఏ పనీ చేయకుండా ఉండాలని ప్రయత్నించాను. బాహ్యకర్మలను మానేసి కూర్చున్నాను. ప్రక్కన ఎవరో ఉన్నారు. వారితో మాట్లాడుతున్నాను. ఎలాగో అతికష్టం మీద మాట్లాడడం మానేశాను. బుర్రలో ఆలోచనలు బయలుదేరాయి. ఆలోచనలు కూడా చేయకుండా ఉండాలంటే సాధ్యపడటం లేదు. ఏమిటి ఇది ఏదైనా వ్యాధా? లేక మానవస్వభావమా?

**నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్।**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥** 5-3

ఇది వ్యాధీ కాదు ఆధీ కాదు. మానవస్వభావం. ప్రకృతి బద్ధుడైన మానవుడు, ప్రకృతి గుణాల వత్తిడివల్ల ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూనే ఉంటాడు శారీరక - వాచిక - మానసికాలని కర్మలు మూడు రకాలు. శారీరక వాచిక కర్మలను ప్రయత్నపూర్వకంగా నిరోధించవచ్చు. కానీ మానసిక కర్మలను నిరోధించడం చాలా కష్టతరమైన విషయం అది యోగసమాధిలోను, గాఢసుషుప్తిలోను మాత్రమే సాధ్యపడుతుంది. అందుకనే మానవుడెలాగూ కర్మలు చేయకుండా ఉండలేడనే, ఎక్కువకాలం దైవారాధన, సత్కాలక్షేపాలకు వినియోగించమన్నారు. లేకపోతే మనస్సు ఏ చెడ్డపనిలో పడుతుందో నని భయం దానికి కారణం.

29. లోకాన్ని ఉద్ధరించాలని బయలుదేరాం. చాలా దీక్షతో, పట్టుదలతో కృషిచేశాం. వేషాలు మార్చాం. భాషలు మార్చాం. తరహాలు మార్చాం. బూడిదలో పన్నీరు పోసినట్లైంది వ్యర్థ ప్రయత్నం చేశామని విసుగుపడి అన్ని పనులు మానేశాం. 'ఈ సంఘాన్ని మార్చలేం' అని అస్త్రసన్యాసం చేశాం. సోమరితనం బాగాపెరిగి పోయింది. శరీరం, జీవితం, కాలం స్తంభించి పోయినాయా? అనిపిస్తోంది. ఏలా దీన్ని పరిష్కరించడం?

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।**
**శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః॥** 8-3

**లోకంలో మనుష్యులు 1. అకర్ములు 2. సకర్ములు 3. నిష్కామకర్ములు అని**

మూడు రకాలుగా ఉంటారు. ఇందులో మీరు ప్రస్తుతం మొదటి తెగలో చేరతారు. తమోగుణం ప్రధానంగా ఉండటంవల్ల అలా అప్రసన్వ్యాసం చేశారు. కనుక నే సోమరులైనారు. కోరికలతో మంచిదో చెడ్డదో ఏదో ఒక పని చేస్తూఉంటే మీరు సకర్ములౌతారు. అప్పుడు రజోగుణం మీలో ప్రధానమౌతుంది. ఇది నా కర్తవ్యమని కర్మలనాచరించాలంటే సత్త్వ గుణం మీలో పెరగాలి. అపుడు మూడవ తెగలో చేరి నిష్కామ కర్ములౌతారు. ఏ పనీ చేయకుండా ఉండే కంటే ఏదో ఒక పనిచేయడం మంచిది. ఏదో ఒక పని చేయడంకంటే కర్తవ్యబుద్ధితో కోరికలు లేకుండా మంచిపని చేయడం శ్రేయస్కరం. ఏ పనీ చేయకపోతే మతి జీవితం, కాలం స్తంభించక తప్పదు. శరీరయాత్రకూడ సమాజంలో గడపటం కష్టం. కనుక ఏదో ఒక పని చేయడం మంచిది.

30. నా మిత్రుడంటాడు: 'దేవతలను ఆరాధించడం' శుద్ధ దండగ. మన కంటికి కనపడని దేవతలు మనం చేసే యాగాలను, పూజలను చూస్తున్నారా? వాళ్ళు మనకేం చేస్తారు? యజ్ఞాలూ యాగాలు ఇవన్నీ అంధవిశ్వాసాలు "మనకున్న దాన్ని చక్కగా అనుభవిస్తే తప్పేమిటని." ఇది నిజమేనా?

దేవాన్ భావయతాఽనేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ ॥ 11-3

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥ 12-3

నవనాగరికతలో మనం తరచు వినే పదం అంధవిశ్వాసం. అందులు కొందఱు మనకీమంత్రాన్ని ఉపదేశించి మనల్ని జ్ఞానాంధుల్నిగా తయారుచేశారు. మీ మిత్రుడు ఈ జాతివాడే. యజ్ఞ యాగాల ద్వారా దేవతలను మనం తృప్తిపరిస్తే వారు మనకు పాడి, పంట మొ॥ అన్ని సమృద్ధులను ఇస్తారు. వారిచ్చిన సుఖభోగాల్లో కొన్నిటిని కృతజ్ఞతతో హవిస్సురూపంలో వారికివ్వడంవల్ల మనకు ఈలోకం లోను పరలోకం లోను సుఖ శాంతులు కలుగుతాయి. వారిచ్చిన సంపదలో వారికేకొంచెం అర్పించకుండా స్వార్థంతో చక్కగా మనమే అనుభవిస్తే, వారి ఆస్తిని అపహరించిన దొంగలమే అవుతాం మనం. అంధవిశ్వాసమంత్రపు మాయలోబడి మనం కృతఘ్నులమైనాం. కాబట్టే వర్షాలు లేకపోవడం కరువులు, కాటకాలు, ఉప్పెనలు, పంటలు పోవడాలు, ఊళ్లు, దేశాలు కొట్టుకుపోవడాలు

సంభవిస్తున్నాయి. యజ్ఞం చేయడం వల్ల సుభిక్షంగా దేశముంటుందని సాంకేతికంగా కూడా నిరూపించవచ్చు. పాశ్చాత్యులు చాలా మంది నిరూపించారు కూడ. కనుక అంధవిశ్వాసాలని అన్నిటినీ తోసిపుచ్చద్దని మీ మిత్రుడితో చెప్పండి.

31. ఏపనీ చేయకుండా ఉండలేం. ఏదో ఒకటి చేస్తూ ఉంటే రాగ ద్వేషాలు కలగకా మానవు. రాగద్వేషాల ప్రభావాలకు లోవడితే మనస్సుకు శాంతి ఉండనే ఉండదు. పనులు చేస్తున్నప్పటికీ రాగద్వేషాల వలయంలో చిక్కుకోకుండా ఉండటమెలా సాధ్య పడుతుంది? అలా కర్మసంగం లేకుండా ఉంటే ఎన్నటికైనా మోక్షం లభిస్తుందా?

తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః॥ 19-3

రాగద్వేషాల వలయంలో చిక్కుకోకుండా కర్మలుచేయడం తప్పక సాధ్యమౌతుంది. ఇంద్రియాలను, మనస్సును వాటి విజృంభణాల నుంచి నిరోధించి ఫలాసక్తి లేకుండా కర్తవ్యతాబుద్ధితో కర్మలను చేయాలి. అప్పుడు మీకు కర్మసంగం ఉండదు. అంటే ఆసక్తి లేదన్నమాట. ఇలా పనులు చేయడాన్ని మహాత్ములు అనాసక్తి యోగమన్నారు. అనాసక్తితో కర్మలను చేసేవారికి పరమపురుషప్రాప్తి రూపమైన మోక్షం కలుగుతుంది.

32. కొందరంటారు: కర్మయోగమే గొప్పదని. ఇంకొందరంటారు: జ్ఞానయోగం గొప్పదని. మరి కొందరంటారు: భక్తియోగం చాలా గొప్పదని. సామాన్యుణ్ణైన నాకు వీటినన్నింటిని పరిశీలించే శక్తి లేదు. సమభావంతో నా కర్తవ్యాన్ని నేను చక్కగా నిర్వహించడం నాకు తెలుసు. నాకు పరిపూర్ణత కలుగుతుందా? ఇలా సిద్ధిపొందిన వారున్నారా?

కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్కర్తుమర్హసి॥ 20-3

ఒక్కొక్కరు వారి వారి అంచనాల ప్రకారం. ఒక్కొక్క విధంగా చెబుతారు

అన్ని వ్యాధులకూ ఒకే మందు, ఒకే మోతాదులో వేస్తే పడవట్లే అందరికీ ఒకే మార్గం కుదరదు కనుక మహర్షులు వాళ్ల వాళ్ల యోగ్యత, అవసరాలను గుర్తించి అనేకరకాలుగా మనకు మార్గాల నుపదేశించారు. అన్నీ గొప్పమార్గాలే అనాసక్తి యోగంతో కర్తవ్య బుద్ధితో కర్మలనాచరిస్తే తప్పక పరిపూర్ణత లభిస్తుంది. అలా కర్మయోగం ద్వారా సిద్ధిని పొందిన వారే జనకాది మహాపురుషులు. పరిపూర్ణతను పొందినప్పటికీ, వారికేమీ అక్కరలేక పోయినప్పటికీ, లోకంలో ఉన్న మనమంతా తమను ఆదర్శంగా అనుసరిస్తాం కాబట్టి వారు కర్మానుష్ఠానాన్ని విడిచివేస్తే, మనం కూడా చేయమని మన కోసమే వారు వ్యవహారం కోసం కర్మలను అనాసక్తితో ఆచరించారు. మనం వారి అడుగుజాడల్లో నడవాలి.

33. మనం ఆదర్శమైన జీవితం గడపడంవల్ల మనకు మాత్రమే లాభమా? ఈ సమాజానికి దాని ప్రయోజనం ఉంటుందా? శివాజీ మొ॥ మహావీరులు రామాయణ-భారతాల్లో పాత్రలను గురించి చిన్నప్పుడే విని ప్రభావితులైవారంటారు, నిజమేనా? మహాపురుషుల జీవితచరిత్రలు చదివితే మనకు సమస్యలనెది రించి నిలచే శక్తి కలుగుతుందా?

యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥ 21-3

మనం ఆదర్శంగా జీవించడంవల్ల మనకు అభ్యుదయం కలగడమే కాకుండా, ఈ సమాజంమీద దానిప్రభావం ఎంతో ఉంటుంది. ఈ సమాజం ఎప్పుడూ ఉత్తమాదర్శాలు కలవారిని అనుకరిస్తుంది. జీవనవిధానాల్లో వారేర్పరచిన ప్రమాణాలను అనుసరిస్తుంది. నిజమే! శివాజీ మొ॥ మహావీరులు చిన్నప్పుడే తల్లులు చెప్పిన రామాయణ-భారతాల్లోని కథలు విని అందులోని నాయకులను చాలావిషయాల్లో ఆదర్శంగా తీసికొని మంచిసంస్కృతిని మనకందించారు. అలాగే మహాపురుషుల జీవితచరిత్రలు చదివితే, వారు క్లిష్టసమస్యల నెలా ఎదుర్కొన్నదీ! ఆ సందర్భాలలో వారు వ్యవహరించిన తీరు, మనకు మార్గదర్శనం చేసి సమస్యల నెదుర్కొనే శక్తిని మనకని కలిగిస్తాయి.

34. రాముడు, కృష్ణుడు, దేవుళ్లంటారు కదా! భగవంతుడు కూడా సామాన్యమానవుడిలాగా గురుకులాల్లో చదవడం, భార్యకోసం బాధపడడం ఇలాంటి లౌకిక కర్మలనెందుకు చేస్తాడు? ఆయనకు మానవుడిలాగా కోరికలు, పుణ్యపాపాలు ఉండవుకదా! వారు మన మాదిరి మానవులైతే మనం వారిని పూజించడం ఎందుకు? వారి కథలను పురాణాల్లో చదవడంవల్ల మానవజాతికేం ప్రయోజనం కలుగుతుంది? అంటాడు నామిత్రుడు. ఏమిటి దీనికి నమాధానం?

నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ 22–3
యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥ 23–3
ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్।
నంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః॥ 24–3

రాముడు కృష్ణుడు శ్రీమహావిష్ణువుఅవతారాలు. భగవంతుడు ఏకోరికతోను లౌకిక కర్మలను మానవుడి లాగా చెయ్యలేదు. ఆయనకు ముల్లోకాలలోను కర్తవ్యమంటూ ఏదీ లేదు. అలాగే అయన పొందంది కాని పొందవలసింది గాని ఏమీ లేదు. అయినా ఆయన కర్మలను ఆచరించాడు. మనుష్యులు అన్నివిధాలా ఆయన ప్రవృత్తిని అనుకరిస్తున్నారు కాబట్టి తన విధులలో ఏమరుపాటు లేకుండా అయన కర్మల నమష్ఠించాడు. అలా కాకపోతే "రాముడే ఇలా చేశాడు కృష్ణుడే ఇలాచేశాడు," అని మనుష్యులు కూడా అలాగే ప్రవర్తిస్తారు. భగవంతుడు కర్మల నాచరించకపోతే ఈలోకాలన్నీ నాశనమైపోతాయి. అనేక రకాల నంకరాలు ఏర్పడతాయి వాటితో ప్రజలు నాశాన్ని పొందుతారు. అందువల్ల వారు కర్మలను మానవులు చేసి నట్లే చేశారు. వారు మానవజన్మను స్వీకరించినంత మాత్రాన వారికీ మనకు తేడా లేదను కోవడం పొరపాటు. కారణజన్ములుగా అవతారం స్వీకరించినవాళ్ళు వాళ్లు. ప్రారబ్ధంతో పుట్టిన వాళ్లం మనం. వారి కథలను చదవడంవల్ల మనకు ఆత్మశక్తి, నైతికశక్తి పెరిగి జీవనవిధానం బాగుపడుతుంది.

35. "నేను చాలా శాస్త్రాలు చదివాను. ఎంతోమంది సాధువులను, సత్పురుషులను తీర్థక్షేత్రాలను సందర్శించాను. ఈలోకపు తీరు తెన్నులనెన్నో సార్లు పరీక్షించాను. కనుక నేను ఏకాంతంగా ధ్యానంలో మునిగి ఉంటాను. జ్ఞానంతోనే మోక్షాన్ని సాధిస్తాను. ఏరకమైన కర్మలనీ నేను చేయకపోయినా పరవాలేదు" అంటారు కొందరు చదువుకున్నవాళ్ళు. ఇలాంటి ప్రవృత్తి మంచిదేనా?

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।
కుర్యాద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షుర్లోక సంగ్రహమ్॥ 25–3

ఆప్రవృత్తి ఎన్నటికీ మంచిదికాదు. ఎన్ని శాస్త్రాలు చదివినా, ఎన్ని తీర్థాలు సేవించినా, ఎంతమంది సత్పురుషులను సందర్శించినా, కర్మలు మానుకోవలసిన పనిలేదు. ఫలితాలను కోరి పామరులెలా కర్మలనాచరిస్తారో విజ్ఞులు కూడా ఫలాపేక్ష లేకుండా, అనాసక్తితో, లోకానికి తాను ఆదర్శంగా ఉండేటట్లు కర్మలను ఆచరించాలి. ఆసక్తి - అనాసక్తులలో తేడాగాని కర్మానుష్ఠానంలో తేడా లేదు. కోరికలతో కర్మలను చేసి అజ్ఞాని కర్మసంగాన్ని పొందగా, ఫలాపేక్ష లేకుండా కర్మలనాచరించి విజ్ఞాని కర్మవిమోచనాన్ని పొందుతాడు. కనుక కర్మలనాచరించడం ఎన్నటికీ తప్పదు.

36. ఎన్నో వేదాంతాలు చదువుకున్నాడతడు. ఏ వేదాంతం మీద నైనా గుక్కతిప్పుకుండా గంటల తరబడి ఉపన్యాసాలు దంచగలడు. సంఘంలో గొప్పవేదాంతిగా పేరుకూడా గడించాడు. కానీ ఉన్నట్టుండి ఒక్కొకసారి చికాకు పడతాడు. ఏదో తాను పోగొట్టుకున్నానంటాడు. ఆవేదన పడతాడు. జ్ఞానం సంపాదించినా సహజ స్వభావం మారదా ఏమిటి?

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి? 33–3

ఎన్ని వేదాంతాలు చదివినా తన లోపలి స్వభావాన్ని బట్టే మానవుడి ప్రవృత్తి ఉంటుంది. ఈ విజ్ఞానం మధ్యలో వచ్చింది. స్వభావం ప్రకృతి సిద్ధమైంది. ప్రకృతి బలీయమైనది కాబట్టి భూతములన్నీ ప్రకృతి బంధం కలవే. కనుక గొప్ప పండితుడైనా

లోపల సంస్కారాలు సరైనవి కాకపోతే చికాకుపడటం, దిగాలుపడటం ఇవన్నీ తప్పక ఏర్పడతాయి. లోపల నిగ్రహం కావాలి. కేవల బాహ్యనిరోధంవల్ల ప్రయోజనంలేదు.

37. వారి వారి జీవితకాలంలో సంభవించిన ఎన్నో తీవ్రసమస్యలను ఎదుర్కొంటూ వాముందుతరాల వారు ఈ ధర్మాన్ని వారసుడైన నాకందించారు. ఇప్పటి నా జీవనపరిస్థితులను అనుసరించి నా సంస్కృతి, నాధర్మం ఏమాత్రం ప్రయోజనకారిగా లేదు, ఇతర సంస్కృతులు ధర్మాలు ఆకర్షణీయంగా ఉండడంవల్ల వాటిని ఆశ్రయించి సమాజంలో సోదరులు చాలామంది చక్కగా బ్రతుకుతున్నారు. నేనేం చేయాలి? పరధర్మాన్ని అనుసరించాలా? స్వధర్మంలోనే ఉండాలా?

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ 35 -3

అక్కడే మీవివేకం పనిచేయాలి. మన ధర్మంలో కాలదేశాల మార్పులను బట్టి కొన్నిదోషాలు కనబడవచ్చు. మనం పరధర్మాన్ని ఇంతకంటే నైపుణ్యంతో నిర్వహించగలిగి ఉండవచ్చు. అయినా స్వధర్మంలో చావువైనా శ్రేయస్సుగా స్వీకరించాలి. ఇతరుల ధర్మం భయంకరమైంది. మనకు తెలియని రోజులనుంచీ మన తాత ముత్తాతలనుండి సంక్రమించిన ధర్మాన్ని వదిలేసి, కొత్త ధర్మాన్ని అనుసరించే టట్లయితే, ప్రాచీన సంస్కారాలను వదిలేసి, కొత్తసంస్కారాలను అలవరచుకోవాలి. దానికే ఒకజన్మ సరిపోతుంది. సమాజంలో అవ్యవస్థ ఏర్పడుతుంది, కాబట్టి ప్రలోభాలకు గురికాకుండా మనధర్మంలో ఉండే విశిష్టతను గ్రహించడానికి ప్రయత్నించాలి

38. పూర్వజన్మలో చేసిన పుణ్యపాపాలనే కదా! మనమీజన్మలో అనుభవిస్తున్నాం. ఇప్పుడనుభవిస్తున్న దుఃఖాలకన్నింటికి పూర్వజన్మలో చేసిన పాపమే కదా! కారణం. అసలు మనం పాపాలనెలా చేస్తున్నాం? అలా చేయకుండా ఉండే మార్గం లేదా?

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥ 37-3

ఇప్పటి దుఃఖాలకు మనం వెనుక చేసిన పాపాలే కారణం. రజోగుణంవల్ల పుట్టిన

కామం, అది నెరవేరనప్పుడు పుట్టే క్రోధం, ఈరెండే అన్ని పాపాలకు మూలకారణాలు. జీవునకు కామానికంటే మించిన శత్రువు కూడా ఇంకొకటి లేదు. ఇది మహాపాపి. భోగానుభవం వల్ల ఇది నశించదు. ఇది ఎన్నటికీ తీరని ఆకలి కలది. ఎన్నో దురాశలను కల్పించి మానవుణ్ణి పతితునిగా తయారుచేస్తుంది. అలా పాపాలు చేయకుండా ఉండాలంటే ముఖ్యశత్రువైన ఈ కామాన్ని నాశనం చేస్తే, దాని ద్వారా కలిగే అనర్థాలు పోతాయి. మనం పాపపు పనులు చేయవలసిన అవసరం లేకుండా పోతుంది.

39. లోకంలో ఎక్కడచూచినా అన్యాయం, అక్రమం విలయతాండవం చేస్తున్నాయి. అధర్మం పెచ్చు పెరిగిపోయింది. ధర్మదేవత భయపడి పారిపోతోంది. మంచివారు జీవించలేక పోతున్నారు. దుర్మార్గులు పట్టపగ్గాలేకుండా వీరవిహారం చేస్తున్నారు. ఎన్నాళ్లీ భయంకర వాతావరణం? ఏమిటి దారి? ఈ స్థితిలో ధర్మాన్ని సంరక్షించి దుష్టులను శిక్షించి, మంచివారిని కాపాడే వాడెవడూ లేడా?

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత। 7_4
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ 8_4

ఎందుకు లేడు? ఇలాంటి సమయాల్లోనే నేను అవతారాన్ని స్వీకరిస్తానని భగవంతుడే స్వయంగా ఇలాచెప్పాడు: ఎప్పుడెప్పుడు ధర్మానికి బాధకలిగి అధర్మం పెచ్చుపెరిగి పోతుందో అప్పుడు నేను ఏదో ఒక అవతారాన్ని పరిగ్రహించి, సాధుజనాన్ని దుర్మార్గుల నుంచి రక్షిస్తాను. దుష్టులను సర్వనాశనం చేస్తాను. ధర్మాన్ని తిరిగి సంస్థాపిస్తాను. భగవంతుడు పూర్ణకాముడు. జీవుడు వాసనాబద్ధుడు. కనుకనే ఆయనది అవతారము, ఇతడిది జన్మ.

40 'మా శివుడే గొప్పవాడు' అని ఒక వర్గమంటుంటే 'మా విష్ణువే గొప్పవాడ'ని ఇంకొక వర్గం. 'అసలు ఆ ఇద్దఱు మా శక్తి లేందే పనికిరార'ని మూడవవర్గం. ఏమిటీ మహాభక్తుల రాజకీయాలు?

మధ్యలో ఉన్న నేను ఎవరిని పూజించాలి? ఎవరిని పూజించినా చేరేది ఒకచోటికేనా? లేక ఇందులో తరతమ భేదాలున్నాయా?

యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥ 11-4

యేప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః।
తేఽపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధిపూర్వకమ్॥ 23-9

ఎవరిని పూజించినా చేరేది ఆ భగవంతునికే. ఎవరెవరు ఆయనను ఏ రూపంలో పూజిస్తే వారి పూజలను ఆ రూపంలోనే గ్రహిస్తాడు. మనుష్యులందఱూ వారిలో ఎన్ని వైవిధ్యాలున్నా ఆయన మార్గాన్నే అనుసరిస్తున్నారు. శ్రద్ధతో ఎవరు ఇతరదేవతలను పూజించినా అది కూడా ఆయనకే చెందుతుంది. అయితే మొదటిపూజ సాక్షాత్తు గాను ఇది పరంపరగాను చెందుతుంది. అంతే తేడా. కనుక మనకెలా వచ్చితే అలా పూజించడానికి స్వామి స్వయంగా అవకాశమిస్తున్నాడు. అయినా రాజకీయాలున్నాయంటే దానికి అజ్ఞానమే కారణం.

41. నా మనస్సుకు తగిన నిగ్రహం లేదు. నా ఇంద్రియాలు ఎంత అదుపుచేసినా నామాట వినవే వినవు. నేను కర్మలు చేయకుండా ఉండలేను. పోగొట్టుకున్న సుఖశాంతుల్ని నేనెలా తిరిగి సంపాదిస్తాను? నాకు కర్మబంధం లేకుండా ఏదైనా సులభోపాయం ఉన్నదా?

న మాం కర్మాణి లింపన్తి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే॥ 14-4

చక్కని సులభోపాయం ఒకటి ఉన్నది. ఎవరు భగవంతునికి కర్మబంధం లేదనీ, కర్మఫలాసక్తి లేనివాడని, ఆయన తత్త్వాన్ని వివేకంతో బాగా గుర్తించగలరో వారికి కర్మబంధం కలగదు. ఆయన అనుగ్రహంవల్ల అతడికి అవతారపురుషుల కర్మతత్త్వం గోచరించి, ఆ ఒరవడిలో కర్తృత్వ భోక్తృత్వాభిమానం లేకుండా కర్మలనాచరించే శక్తి కలుగుతుంది. నిష్కామకర్మయోగం అభ్యాసమౌతుంది.

42. 'పండిట్' గారంటే నిజంగా పండితుడనుకున్నాను. శాలువాలు, మకరకుండలాలు, సింహతలాటాలు చూచి పండితులు ఇలా ఉంటారనుకున్నాను. కాని హృదయాలు కదిపి చూశాను. అపశ్రుతులు పలికాయి. అసలు నిజమైన పండితుడంటే ఎలా ఉండాలి? అతడి మనస్తత్వం ఎలా ఉంటుంది?

యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః॥ 19-4

'పండ' అంటే వివేకం. అది కలవాడు పండితుడు. కోరికలు వాసనలు లేకుండా ఎవరు కర్మలనాచరిస్తారో, ఎవరు జ్ఞానాగ్నితో కర్మలను నాశనం చేసుకున్నారో వారిని వివేకులు పండితుడని అంటారు. మనం చేసిన ప్రతిపనికి బాహ్యఫలితం, ఆంతరఫలితం రెండు కలుగుతాయి. ఇవి రెండూ తాత్కాలికం - కాలాంతరమని మళ్లా రెండురకాలు. చూడండి: మనమొక మామిడిపండు నెవరికో ఇచ్చాం. వెంటనే వాడు దానిని తిని సుఖపడతాడు. ఇది తాత్కాలికమైన బాహ్యఫలితం. పండునివ్వటం అనే కర్మనుంచి కాలాంతరంలో వేరే జన్మలో మనకు ఆహారసమృద్ధి కలుగుతుంది. ఇది కాలాంతర బాహ్యఫలితం. అలాగే ఆకలి గొన్నవాడికి ఆహారమిచ్చాం. కాబట్టి మన మనస్సుకు సంతోషం కలుగుతుంది. ఇది తాత్కాలికమైన ఆంతరఫలితం. ఇదే మన మనస్సులో సూక్ష్మంగా బీజరూపంలో ఉంటుంది. దీన్నే సంస్కారం, వాసన, సంకల్పం అంటారు. దీని వల్ల ఇంకో సమయంలో పరిస్థితులనుకూలంగా ఉంటే అలాంటి దానం చేయాలనే కోరిక కలుగుతుంది. కనుక ఇలాంటి కోరికలు మన మనస్సులో ఇదివరకు బీజరూపంలో ఉన్న సంస్కారాల ద్వారా కలుగుతాయి. చెడ్డపనులు చేస్తే చెడ్డసంస్కారాలు కలుగుతాయి. మంచిపనులు చేస్తే మంచి సంస్కారాలు కలుగుతాయి. వీటివల్లనే మానవుడు సంసారచక్రంలో చిక్కుకుంటాడు. ఈ రెండురకాల ఫలితాలను వదలిపెట్టడమే జ్ఞానాగ్నితో కర్మలను నాశనం చేసుకోవడం అన్నదానికి భావం. అలా చేసుకున్నవాడే పండితుడు. నిష్కామప్రవృత్తితో అతడి మనస్సు వాసనారహితమౌతుంది. వాడే మోక్షానికర్హుడు.

43. లోకంలో బ్రతుకుతున్నాం కాబట్టి చేతులు కాళ్లు కట్టుకు కూర్చోవడం కుదరదు. ఎన్నో వ్యవహారాలు చేయాలి. ఈ పనులు

చేస్తూ మనకు కర్మబంధంలేకుండా ఉండాలంటే సాధ్యమౌతుందా? దానికి మనమేం చేయాలి?

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః॥ 20-4

నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ 21-4

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః।
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే॥ 22-4

మీరు కర్మబంధం లేకుండా ఉండాలంటే చేతులూకాళ్లూ కట్టుకు కూర్చోనక్కరలేదు. కర్మఫలాలపైన ఆసక్తిని వదిలిపెట్టాలి. ఇతరుల నాశ్రయించకుండా తృప్తితో మీ నిత్య కృత్యాలను మీరు నిర్వహించాలి. అప్పుడు మీకు కర్మబంధం ఉండదు. ఆశను వదలి పెట్టి, ఎవరి దగ్గఱా ఏమీ తీసుకోకుండా ఇంద్రియాలను, మనస్సును నిగ్రహించి, కేవలం శారీరకమైన కర్మలను చేసేవాడికి కర్మలవల్ల పాపం కలగదు. భగవదనుగ్రహంవల్ల కాని సుఖప్రారబ్ధంవల్ల కాని అనుకోకుండా లభించిన వాటితో సంతృప్తిని పొంది, చలి, తాపం మొదలైన ద్వంద్వాలకు లొంగిపోకుండా, అసూయ లేకుండా, కార్యం సిద్ధించినా, సిద్ధించక పోయినా సమానంగా భావించేవాడు కర్మలచే బద్ధుడు కాడు. తన మంచిచెడ్డలను భగవంతునికి వదలి ఏ విధమైన విచారంలేకుండా వ్యవహరించేవాడు ఎన్నికర్మలు చేసినా అవి అకర్మలే గాని కర్మలు గావు.

44. ప్రపంచతత్త్వాన్ని అరచేతులో రేగుపండులా చూడగల మహాను భావులుంటారుకదా! తత్త్వదర్శులైన వారినుంచి తత్త్వజ్ఞానాన్ని పొందాలంటే మనమేంచేయాలి? వారి ఉపదేశాన్ని పొందడానికి మనకు కావలసిన అర్హత ఏమిటి?

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥ 34-4

అలాంటి మహానుభావులు దొరికినప్పుడు వారిని సమీపించి, వినయంతో వారికి నమస్కరించి, వారిని అన్నివిధాలా సేవించి, యోగ్యమైన సమయం దొరికినప్పుడు ప్రశ్నిస్తే

జ్ఞానులు తత్త్వవిదులైన, వారు మీకు జ్ఞానాన్ని ఉపదేశిస్తారు. మీకుండవలసిన అర్హత వారికి విధేయులై వారివమనరించి ఉండడమే.

45. మనసుతో, మాటతో, శరీరంతో నేను మంచిపని ఏ ఒక్కటీ చేయలేదు. నేను చేయని అక్రమాలులేవు, అన్యాయాలులేవు. ఎన్నో పాపాలుచేశాను. ఇప్పుడు నాగతి ఏమిటి? నా పాపాలకు నిష్కృతి ఏమైనా ఉందా?

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥ 36-4

నీవేమీ భయపడవలసిన పనిలేదు. నీకు తప్పక నిష్కృతి లభిస్తుంది అయితే నీవు చేసిన తప్పులను గురించి నిజంగా నీవు పశ్చాత్తాపపడాలి. ఇక ముందెప్పుడు ఈ తప్పులు చేయనని ప్రతిజ్ఞ తీసుకోవాలి. నీవెంత మహాపాపివైనా జ్ఞానమనే తెప్పతో ఈ పాపసాగరాన్ని దాటి వేస్తావు. పాపకారణాలైన కామక్రోధాలను వర్జించి, మనస్సును ఇంద్రియాలను నిగ్రహించితే అది సాధ్యపడుతుంది.

46. ప్రపంచంలో అనేక వస్తువులున్నాయి. అన్నింటినీ పవిత్ర మైనవనలేం. అగ్నిహోత్రుడు, పరమపావని గంగ మొ॥ వాటిని మనవారు పవిత్రమైనవిగా చెప్పారు. ఇంతేనా ఇంతకంటే పవిత్ర మైనదేదైనా ఉందా? ఉంటే దాన్ని మనమెలా పొందుతాం?

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥ 38-4

నిజమే! అవి పవిత్రమైన వస్తువులే. కాని అంతకంటే పవిత్రతమమైంది ఇంకొక టుంది. అదే జ్ఞానం. జ్ఞానం కంటే పవిత్రమైంది ఇంకేదీ లేదు. దానిని నిష్కామ కర్మయోగాభ్యాసంతో కొంతకాలానికి నీ ఆత్మలోనే నీవు పొందుతావు.

47. మొదటినుంచీ వాడికి జ్ఞానంలేదు. సంపాదించాలనే శ్రద్ధలేదు. పైపెచ్చు దేన్ని గురించీ నిలకడైన బుద్ధిలేదు. అన్ని

విషయాల్లోను అనుమానాలు హెచ్చు. వారి గతేమిటి? వారికి ఎప్పుడైనా, ఎక్కడైనా సుఖపడే యోగముందా?

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥ 40-4

అజ్ఞాని, శ్రద్ధలేనివాడు, అన్నింట్లోను అనుమానాలు కలవాడు ఈ లోకంలోనే కాదు, పరలోకంలోను సుఖపడడు. అతడు సుఖశాంతులను పోగొట్టుకొని సమాజానికి కూడా సుఖశాంతులను దక్కనీయడు. కనుక సమాజశ్రేయస్సు కోసమైనా ఈ అవలక్షణాలను అతడిలో పోగొట్టే ప్రయత్నం చేయాలి.

48. ఎన్నో విద్యలనభ్యసించి ఎంతో జ్ఞానాన్ని సంపాదించిన యోగులు, పరమహంసలుకూడా లోకవ్యవహారాలనెందుకు చేస్తారు? వారు కర్మలు చేయవలసిన పనిలేదు కదా!

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి।
యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే॥ 11-5

వారు పరమహంసలే, మహాయోగులే. కానీ వారు ఆత్మవిశుద్ధికోసం నిష్కామ కర్మయోగంతో కర్మఫలాసంగాన్ని వదలి శరీరంతో, మనస్సుతో, బుద్ధితో, ఇంద్రియాలతో కర్మలను చేస్తూనే ఉంటారు. లోకసంగ్రహబుద్ధితో కూడా కర్మలను చేస్తారు. వారు కర్మలను చేయవలసిన అవసరం వారికి లేదు. కాని ఆత్మశోధనకోసం కర్మలను వారు కూడా చేస్తూనే ఉంటారు.

49. జ్ఞానులు కర్మలు చేస్తున్నా సుఖంగా, శాంతిగా ఉంటారు. అజ్ఞానులు కర్మలు చేస్తూ, సుఖసంతోషాలను కోల్పోయి తమ జీవితాన్ని అశాంతిమయం చేసుకుంటారు. ఈ ఇద్దరిలో తేడా ఎక్కడుంది?

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ 12-5

సమభావన పొందగలిగినవారు, కర్మఫలసంగం లేకుండా అనాసక్తితో కర్మలు చేసే నేర్పును పొందినవారు యుక్తులు. వారు కర్మఫలాసక్తి లేకుండా కర్తవ్యతాబుద్ధితో

కర్మలను చేసి స్థిరమైన శాంతిని పొందుతారు. కార్యసిద్ధి, కార్యాసిద్ధి విషయంలో సమభావనలేక, ఫలాలను ముందే ఊహించి, కోరికలతో కర్మల నాచరించేవారు అయుక్తులు. కర్మఫలసంగం ఉంది కాబట్టి, వారు కర్మబంధంలో చిక్కుకుంటారు. సుఖసంతోషాలను, కోల్పోయి అశాంతితో బాధపడుతుంటారు. కర్మఫలసంగం లేకపోవడం, ఉండడం అనేవి ఈ ఇద్దరి మధ్యగల తేడాలు.

50. మనం స్వతంత్రంగా ఈ లోకంలో ఏ పనులైనా చేయగలమా? "దీనిని నేను సాధించాను" అని తమ గొప్పతనం చాలామంది చాటుకుంటుంటారు. ఫలితాలు మన ప్రయత్నం వల్లనే సాధింప బడతాయా? లేక అతీతమైన విధి ఏదైనా ఉందా?

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥ 14-5

మనం స్వతంత్రంగా ఏ కార్యాన్నీ చేయలేం. ఫలితాలు కూడా కేవలం మన ప్రయత్నాల మీద ఆధారపడి కలగవు. భగవంతుడు జీవునికి కర్తృత్వాన్నిగాని, కర్మాచరణాన్నిగాని కల్పించడం లేదు. కర్మఫలాలమీద ఆసక్తిని కూడా ఆయన సృష్టించడం లేదు. వారివారి ప్రకృతులను బట్టి వాసనలను బట్టి, ప్రారబ్ధాలను బట్టి ఇవన్నీ క్రమంగా ఏర్పడుతున్నాయి.

51. "నేను పుట్టిందగ్గర నుంచి నాకేమీ కలసిరాలేదు. ఎన్నో మొక్కులు మొక్కాను. కానీ నాకేమీ జరగలేదు. నిజంగా దేవుడుంటే, ఆయన భక్తులను రక్షించే వాడే ఐతే నా పాపం పోగొట్టి నా బాధలనెందుకు తీర్చడు? అటువంటి దేవుణ్ణి నేనెందుకు పూజించాలి? ఆయన నిజంగా పక్షపాతం లేనివాడేనా?

నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః॥ 15-5

దేవునికి పక్షపాతం ఉండనే ఉండదు. ఎవరి పాపాన్నిగాని, ఎవరి పుణ్యాన్ని గాని ఆయన తీసివేయడు. జ్ఞానం అజ్ఞానం చేత ఆవరింపబడటం వల్ల మానవులకు ఇలాంటి మోహం ఏర్పడుతున్నది. నీ సుఖప్రారబ్ధం సుఖాలనిచ్చేటట్లు, నీ దుఃఖప్రారబ్ధం దుఃఖాల

నిచ్చేటట్లు మాత్రమే ఆయన చేస్తారు. నీవనన్య భక్తుడవై ఏ కోరికలు లేకుండ ఇతరులను నమ్మకుండా ఆయనపై భారం మోపినపుడు నీ బరువు బాధ్యతలను ఆయన స్వీకరిస్తారు.

52. ఈనాడు సమసమాజభావన రావాలని, ప్రతివ్యక్తి నీ గౌరవించా లనీ ఎక్కువగా ప్రచారం చేస్తున్నాం. ఇది మన దేశంలో ఇప్పుడు కొత్తగా వచ్చిన మార్పా? లేక ప్రాచీన భారతీయులకు కూడా అలాంటి భావన ఉన్నదా?

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః॥ 18-5

ఇది మనదేశానికి కొత్తకాదు. ఈ గడ్డపై పుట్టిన ప్రతివాడూ మానవులలో మాత్రమే సమాన భావం కలవాడు కాదు. మానవేతరాలైన సామాన్యజీవుల విషయంలో కూడా సమానభావం కలవాడు. విద్యా వినయసంపన్నుడైన బ్రాహ్మణునిలోను, గోవులోను ఏనుగులోను, కుక్కలోను, కుక్కమాంసం తినేవానిలో కూడా వివేకం కలవారు. సమానమైన జీవభావాన్ని, అంతర్యామిగా ఉన్న పరమాత్మ భావాన్ని సాక్షాత్కరించుకొన్న దేశం ఇది. ఎంతో కాలం నుంచి తోటిమానవులను బానిసలుగా చూచిన జాతులు, భారతీయులమైన మన ఉదార సంస్కృతిని చూచి సిగ్గుపడ్డాయి.

53. నేనొక కార్యంకోసం ప్రయత్నించాను. కృషి ఫలించింది. కార్య సిద్ధి కలిగింది. ఉబ్బితబ్బిబ్బులై పోయాను. ఇంకో పని మొదలు పెట్టాను. అన్నీ విఘ్నాలే. ఫలితం శూన్యం. నిలువునా కుంగి పోయాను. ఇలా ఉండటం మంచిదేనా? సుఖదుఃఖాలెదురై నప్పుడు నేనెలా ఉండాలి?

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్।
స్థిరబుద్ధిరసంమూఢో బ్రహ్మవిద్ బ్రహ్మణి స్థితః॥ 20-5

ఇది మీ మనస్సులోని బలహీనతను తెలియజేస్తుంది. ఇష్టసిద్ధి కలిగినప్పుడు ఉబ్బితబ్బిబ్బులు కాకూడదు. ఇష్టం సిద్ధించనప్పుడు నీరు కారిపోకూడదు. రెండింటిని సమానభావనతో భగవత్ప్రసాదంగా స్వీకరించాలి. స్థిరబుద్ధితో, వివేకంతో నిష్కామ

కర్మయోగంతో ఉండే బ్రహ్మజ్ఞాని ఎల్లప్పుడు పరబ్రహ్మ స్థితిలోనే ఉంటారు. సుఖదుఃఖాలు కలిగినప్పుడు ఉద్రేకాలను పొందక శాంతితో ఉంటారు.

54. చిన్నతనం నుంచి చాలా కష్టాలు పడ్డాను. ఏదో చదువుకున్నాను. జ్ఞానంకోసం కాదు ఉద్యోగంకోసం. ఉద్యోగం దొరికింది. జీతం జీవితం గడపడానికి చాలదు. ఎన్నో నిరాశలు, నిస్పృహలు, విట్టూర్పులు పెద్దవ్యాపారం పెట్టాను. లాభాలొచ్చాయి. ఇంకా రెండు మూడు సంస్థలను పెంచాను. ఉన్నట్టుండి వ్యాపారంలో నష్టం వచ్చింది. కుప్పకూలిపోయాను. వాటినాశించడం తప్పా? ఎక్కడ నేను తప్పు చేశాను?

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
అద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః॥ 22-5

మీ సంకల్పంలో తప్పుంది. మీరు సుఖం కావాలనుకొని సుఖసాధనాలను సంపాదిస్తూ అవే సర్వస్వమనుకున్నారు. బాహ్యవస్తువులతో ఇంద్రియ సంయోగంవల్ల కలిగే బాహ్యసుఖాలన్నీ అశాశ్వతాలు. అవి దుఃఖంలోనించి పుట్టేవి. తాత్కాలికాలు. క్షణికాలు. కర్మఫలాసక్తితో మీరు ప్రవర్తించారు. మంచి జరిగినన్ని నాళ్ళు మీకు మీరే సంతోషపడ్డారు. గర్వపడ్డారు. నష్టం వచ్చేటప్పటికి విచారపడుతున్నారు. లాభానికైనా నష్టానికైనా మీ ప్రారబ్ధం కారణం. కర్మఫలసంగం వదలిపెట్టండి. ఆ భౌతిక సుఖాలకోసం పాకులాడకండి. వివేకంగలవారు చేసే పని కాదది.

55. నాకు స్నేహితులున్నారు. మిత్రులు, శత్రువులూ ఉన్నారు. తటస్థులు, మధ్యస్థులు, ద్వేష్యవర్గం, బంధువర్గం ఎందరో ఉన్నారు. సాధువులతో నాకు పరిచయం ఉంది. పాపులు కొందరు నాకు తెలుసు. వీరందరితో కలసి నేను జీవించాలి. వివేకంగలవాడు వీరందరితో ఎలా ప్రవర్తిస్తాడు?

సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబన్ధుషు।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥ 9-6

వివేకం గలవాడికి జీవులంతా ఒకటే. సుహృత్తులు, మిత్రులు, శత్రువులు, తటస్థులు, మధ్యస్థులు, ద్వేషింపదగినవారు, బంధువులు, సాధువులు, మహాపాపులు, వీరందరి విషయం

లోను సమానభావనే వారికి ఉంటుంది. ఎవరి విషయంలోను రాగంగాని, ద్వేషంగాని ఉండదు.

56. భగవంతుడు భక్తపరాధీనుడంటారు. మరి అందరిని సమానంగా రక్షించాలి కదా! అలా ఎందుకు రక్షించడు? అలా రక్షించ బడటానికి భక్తులలో ఏదైనా ప్రత్యేకార్హత కావాలా? అయితే అదెలా ఉండాలి.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాఽహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ 30-6

అవును. "ఏ భక్తులైతే తనను ప్రపంచమంతటా సాక్షాత్కరింప చేసుకోగలరో, ప్రపంచంలోని జీవులనందరినీ నాలో చూడగలరో వారికి నేనెల్లప్పుడు అండదండలుగా నిలుస్తాను. అతడు కూడా నాకు లేకుండా పోడు. అంతటి విశ్వరూప భావనచేయగల భక్తులను నేనెల్లప్పుడు కాపాడుతాను. అతడు ఆ ప్రత్యేకార్హతను ఎల్లప్పుడు కలిగి ఉంటాడు" అని భగవంతుడే స్వయంగా చెప్పాడు

57. ఈ రోజుల్లో ఎన్ని విద్యలు నేర్చినా, ఎంత వయస్సువచ్చినా, ఎన్ని దేశాలు తిరిగినా, ఎవరూ ఇతరులను అందరిని తనతో సమానంగా చూడటం నేర్చుకోలేదు. సమాజంలో ప్రతివాడూ తన కంటే తక్కువవాడేననీ, తను చాలా గొప్పవాణ్ణనీ అతడిఊహ. అసలు భగవంతునికి ప్రీతిపాత్రుడెవరు? యోగులందరిలో ఉత్తముడైన వాడెవడు?

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ 32-6

ఎవరు తోటి జీవులకు లౌకికమైన సుఖ దుఃఖాదులన్నింటిలో, తనకు సంభవించినట్లే భావించి సహాయం చేస్తూ అందరిని తనలాగానే చూసుకొంటారో అతడే భగవంతునికి హెచ్చు ప్రీతిపాత్రుడు. అతడే పరమయోగి. దీనివల్ల ఇతరులు మనకేం చెయ్యాలని మనం వాంఛిసుంచి ఆశిస్తామో! దాన్నిమనం వారికి చేయాలనే సత్యం తెలుస్తున్నది. తన ప్రవర్తన వల్ల ఇతరులకు కలిగే మంచి చెడ్డలను దృష్టిలో ఉంచుకొని వాళ్ళతో వ్యవహరిస్తే ఎవరికీ

బాధను కలిగించవలసిన అవసరం రాదు తోటి మానవుణ్ణి కవీనం తనతో సమానంగా చూడగలగడమే గొప్ప సంస్కృతి అది లేనివారు ఎంత చదివినా, పుస్తకాలలో పురుగుకీ వాడికీ తేడా ఉండదు.

58. ఎంతో ప్రయత్నం చేశాను. కాని మనస్సును నిరోధించడం చాలా కష్టంగా ఉంది. అసలు మనస్సు స్వరూపమేమిటి?

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥ 34-6

నిజమే! మనస్సును నిగ్రహించడం అంత తేలికైన పని కాదు. అది అభ్యాసం చేయగా చేయగా ఏర్పడుతుంది. సహజంగా మనస్సు చంచలమైంది. నిలకడగా ఉండదు. వెనకటి సంస్కారాలవల్ల చాలా ప్రబలమైంది. అలాంటి మనస్సును నిగ్రహించడం, ఝంఝా మారుతాన్ని లాగి పట్టడం లాంటి పని. అది ఎవరికీ తేలిగ్గా సాధ్యపడేది కాదు. కనుక నిరంతరాభ్యాసం వల్లనే దానిని సాధించాలి.

59 ఏదో యోగాన్ని అభ్యాసం చేశాను. సిద్ధి కలగలేదు. అందులో నిలువలేకపోయాను. నాగతి ఏమిటి? నేను నశించవలసిందేనా?

పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే।
న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి॥ 40-6

ఎన్నటికీ నశించవలసిన పనిలేదు. ఈ లోకంలో గాని పరలోకంలో గాని మీలాంటి వాళ్లు నాశాన్ని పొందడానికి వీల్లేదు. మంచి భావనతో మంచిపని చేసేవారు ఏ ఒక్కరూ ఎప్పటికీ దుర్గతిని పొందరు. అతడి భావనవల్ల అతడు ఎప్పుడూ మంచిని, సుఖసంతోషాలను పొంది తీరతాడు.

60. యోగాభ్యాసం చేసికూడా నిష్ఠతో లేనివాడు తిరిగి ఏమౌతాడు? వాడికి పరలోకంలోను, ఈలోకంలోను, ఏదైనా మంచి కలుగుతుందా?

ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥ 41-6

యోగభ్రష్టుడు చనిపోయిన తరువాత పుణ్యాల్ని సంపాదించిన వారి లోకాల్లో కొంత

కాలం సుఖభోగాలను అనుభవిస్తారు. కర్మక్షయమైన తరువాత మళ్లా భూలోకంలో, మంచి ఆచారసంపత్తిగల శ్రీమంతుల ఇళ్లలో పుట్టి, అనేక వైభవాలతో జీవితం సాగిస్తారు. యోగాన్ని అనుష్ఠించినా మనస్సుకు భోగవాసనలున్నాయి కాబట్టి, వాటి ననుభవించడానికి ఇలా జన్మలెత్తవలసి వస్తుంది.

61. మనం యోగసిద్ధికోసం ప్రయత్నించే సాధకులను ఎంతమందినో చూస్తూ ఉంటాం. వాళ్లందరికీ భగవత్తత్త్వం గోచరిస్తుందా? వాళ్లలో చాలామంది మధ్యలోనే నిరుత్సాహంవల్లనో, ఇతర కారణాలవల్లనో సాధన చేయకుండా విరమిస్తారుకదా! ఏమిటిది?

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 3-7

మనుష్యులందరికీ భగవంతుడిమీద విశ్వాసం కలగదు. ఎన్నో జన్మల సంస్కారాలవల్ల వేలమంది మనుష్యుల్లో ఏ ఒక్కడో యోగసిద్ధికోసం ప్రయత్నంచేస్తాడు. యోగసిద్ధికోసం సాధనచేసే ప్రతివాడూ తన సాధన చివరివరకూ కొనసాగించలేడు. విఘ్నాలకు లోబడిపోయి విరమిస్తాడు. వాళ్లల్లో అందరిలో ఏ ఒక్కడో భగవంతుని స్వరూపాన్ని సరిగా అర్థం చేసుకొని ఆయన్ని ఆరాధించగల్గుతాడు. పూర్వవాసనలు జీవుణ్ణి మంచిపనులు చేయనీయవు. ఒక చెట్టుకు పుట్టిన పిందెలన్నీ పండ్లు కాలేవు. కొన్ని మధ్యలోనే రాలిపోతాయి. చివరివరకు చెట్టుకే ఉన్నవే పండ్లౌతాయి. అలాగే సాధకులు కూడా.

62. ఈ ప్రపంచంలో మనకు కనపడే వస్తుజాలం భగవంతుని కంటే గొప్పదా? లేక ఈభూతాదులే భగవంతుడా? అలా కాకపోతే భగవంతుడు వీటిలో ఎలా ఉన్నాడు?

మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ 7-7

ఈ లోకంలో భగవంతుని కంటే ఉత్కృష్టమైన వస్తువింకొకటి లేదు. లోకంలో ఉన్న వస్తువులన్నీ ఆయన కంటే తక్కువవే. దారానికి మణులన్నీ గుచ్చితే మణులహారం అవుతుంది. మణులు నిలబడాలంటే లోపలి దారం ముఖ్యాధారం. ప్రపంచం ఇలా నిలబడాలంటే

ఆయన మాత్రంలాగా ఆసరా ఉండాలి. మణిహారంలో లోపల ఉన్న దారం కనబడనట్లే అవ్యక్తుడైన పరమాత్మకూడా అంతర్యామిగా కనబడకుండా అన్నింట్లోను ఉంటాడు.

63. ప్రపంచమంతా మాయామయం అంటారు కదా! మాయ అంటే ఏమిటి? ఆ మాయను మానవుడు దాటగలడా?

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే॥ 14-7

భగవంతునిచే కల్పించబడిన యోగమాయ, సత్త్వం - రజస్సు - తమస్సనే మూడు గుణాల రూపంలో ఉన్నది. ఇది జీవులకు దాట రానిది. ఈమూడు గుణాల సామ్యావస్థను సంపాదించినవాడే ఈ మాయను దాటగలడు. అటువంటి సామ్యావస్థ భగవంతుని శరణు జొచ్చిన వారికే సాధ్యపడుతుంది. ఇతరుల కెవ్వరికి సాధ్యం కాదు. కనుక భగవంతుని శరణుజొచ్చి మాయ మేలిముసుగులో నుంచి మనం బయటపడాలి.

64. అందరు భగవంతుని చేతనే సృష్టింప బడ్డారు కదా! కొందరు దేవుడే లేడని నాస్తికులై పోతారెందుకని?

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః॥ 15-7

నిజమే! అందరు భగవంతుని చేతనే సృష్టింపబడ్డారు. కాని వారి వారి పూర్వ జన్మవాసనలవల్ల వారిలో సత్త్వ - రజ - స్తమోగుణరూపమైన మాయ చోటు చేసుకుంటుంది. ఆ మాయవల్ల వివేకం శూన్యమై కొందరు నరాధములుగా తయారౌతారు. వారి భావనలు, ప్రవృత్తులు రాక్షసమౌతాయి. వారికి దేవుడు లేడని, పునర్జన్మ లేదని, పరలోకం లేదని, అంతా శూన్యంగా ప్రపంచం గోచరిస్తుంది.

65. భగవంతుణ్ణి ఎందరో పూజిస్తారు కదా! వీరందరు ఒకేరకం వారు కాదు. మరి వారిని ఎన్నిరకాలుగా మనం విభజించవచ్చు?

ఏమిటి వారి స్వరూపం?

చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥ 16-7

మంచిమార్గంలో తాము నడిచి, లోకానికి ఆదర్శంగా నిలబడగలిగిన సజ్జనులు భగవంతుణ్ణి ఆరాధిస్తుంటారు. వారు 1. ఆర్తులు 2. జిజ్ఞాసువులు 3 అర్థార్థులు 4. జ్ఞానులని నాల్గు రకాలు. విపరీతమైన బాధలవల్ల ఆర్తులై అవి పోవాలని దేవునికి మొక్కే వారు ఆర్తులు. ప్రపంచ తత్త్వాన్ని, ఆత్మతత్త్వాన్ని, భగవత్తత్త్వాన్ని తెలుసుకోగోరే ముముక్షువులు జిజ్ఞాసువులు. ఈ లోకంలో భోగాలను, సంపదలను, కీర్తి ప్రతిష్ఠలను కోరి ఆరాధించేవారు అర్థార్థులు. ప్రపంచమంతా వాసుదేవమయంగా భావనచేయగలవారు జ్ఞానులు. ఇలా భక్తులు నాలుగురకాలుగా ఉంటారు వారి వారి అర్హతలకు తగినట్లు భగవంతుణ్ణి సేవిస్తుంటారు.

66. హిందువులకు మతసహనం ఉందంటారు కదా! ఏదేవతనైనా పూజించవచ్చా? మరి భగవదనుగ్రహం కలుగుతుందా?

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥ 21-7

తప్పకుండా కలుగుతుంది. ఎవరెవరు లోకంలో ఏ దేవతను ఆరాధించినా భగవంతుడు వారికి ఆ దేవతలోనే శ్రద్ధను కలిగిస్తాడు. వారికి ముందు ఇష్టదేవతారాధనలో శ్రద్ధను కలిగిస్తే తరువాత వారు లక్ష్యశుద్ధి ఏర్పడి పరమేశ్వరారాధనం చేయగలుగుతారు కనుక హిందూ మతంలో ఎవరి ఇష్టదేవతను వారారాధించుకోవడానికి అవకాశం ఉంది కనుకనే వారికి మతసహనం తప్పకుండా ఉంటుంది. ఏమతం వారు ఏ దేవత నారాధించినా అది పరంపరగా పరమేశ్వరునికే చేరుతుంది. వారికి తప్పక ఆయన ప్రసాదం కలుగుతుంది.

67. దశావతారాలంటారు. చేప, తాబేలు, పంది, సింహం, మరుగుజ్జు, ఇతర మానవమాత్రులుగా ఉండే రాముడు, కృష్ణుడు మొ॥ వారిలోనా భగవంతుడవతరించాడు? అందరు దేవుళ్లేనంటారా?

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్॥ 25-7

అవును. అవన్నీ దైవాంశలే. సంకుచితమైన మన దృష్టిలో తక్కువ ఎక్కువ

భావాలుంటాయి గాని, దేవుడికి జీవులందఱు సమానులే. ఒక్కొక్క ప్రయోజనం సాధించ డానికి ఒక్కొక్క అవతారాన్ని ధరించాడాయన. మనం మాయలో మునిగి ఉన్నాం కాబట్టి అజ్ఞానంవల్ల ఆయన అవతారతత్త్వాన్ని తెలుసుకోలేం. మూర్ఖులైన జీవులు ఆయన నిత్యుడనీ మనవలె కర్మబంధంలో పుట్టేవాడు కాడని, నశించేవాడు కాడని తెలుసుకో లేరు. జ్ఞానులకు మాత్రమే ఆయన స్వరూపం అర్థమవుతుంది.

68. మనవాళ్లు ఎంత చాదస్తులో చూడండి. ఎవణ్ణీ సుఖంగా బ్రతక నివ్వరు సరికదా! ఎవడన్నా చస్తూ ఉంటే చివఱకు వాణ్ణి సుఖంగా చావను కూడా చావనివ్వరు. వాడి చెవిలో "నారాయణ నారాయణ" అని అరవటం, నోట్లో తులసితీర్థం పోయడం. ఏమిటండీ ఈ వెఱ్ఱి? చచ్చి పోయేటప్పుడు కూడా దేవుడెందు కండీ? వీళ్ల నమ్మకాలేమిటోగాని పిచ్చెక్కిపోతూంది బాబూ!

అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥ 5-8

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కలేబరమ్।
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః॥ 6-8

మనవాళ్లు "చాదస్తులు, గుడ్డినమ్మకం కలవారు" అనుకొన్నంత కాలం మీకు వారి ఆచారాలు, అలవాట్లు వెఱ్ఱిగా కనబడటంలో ఆశ్చర్యం లేదు. ముందే నిర్ణయానికి రాకండి మీ బుద్ధితో ఆలోచించండి. బాగా బ్రతికినప్పుడు మనస్సులో ఏ భావాలు దృఢమైన సంస్కారాలను కలిగిస్తాయో అవి ఎప్పుడూ జ్ఞాపకమొస్తాయి. మరణకాలంలో జీవుడు దేన్ని స్మరిస్తాడో, దాని అనుబంధం వదలలేక తిరిగి ఆ జన్మను పొందుతాడు. అందుకనే భగవంతుణ్ణి స్మరిస్తూ కన్నుమూస్తే భగవత్స్వరూపాన్నే పొందుతాడు. అన్ని జ్ఞానాలూ ఉన్నప్పుడే నిరంతరం భగవన్నామస్మరణ చేసుకున్న వాడికి, మరణసమయంలోనూ దేవుడు జ్ఞాపకం వస్తాడు. అలా చెయని వాడికి దైవస్మరణ కలిగే అవకాశంలేదు కనుక ఇంతకు పూర్వం చేసినవాడికి మరణ బాధవల్ల ఇంద్రియాలు మనస్సు పనిచేయక దేవుడు స్మరణకు రాడని, ఇంతకు పూర్వం దైవస్మరణ చేయని వాడికి జ్ఞాపకం వచ్చే అవకాశమే లేదనీ, మనవాళ్లు మరణసమయంలో చెవిలో 'నారాయణ! నారాయణ! అని వినిపిస్తారు, అప్పుడైనా దైవస్మరణ కలుగుతుందేమో నని చెవి పని చేయక, అది వినబడక పోయినా

'తులసితీర్థం' నోట్లో వేస్తేనైనా దేవుని స్మరణ కలిగే అవకాశమున్నదని అలా చేస్తారు. తులసి కంఠంలో ఉన్న కఫాన్ని పోగొడుతుంది.

69. మా అమ్మమ్మొకావిడ ఎప్పుడూ పెదిమలాడిస్తూ 'రామా' అనో 'కృష్ణా' అనో అంటుంటుంది. మా యింటి ఎదుటాయన చేతిలో ఒక తులసిమాల పెట్టుకొని పూసలు లెఖ్ఖేస్తుంటాడు. ఎవరెన్ని మాట్లాడుకున్నా పట్టించుకోడు. వీళ్ళకేమైనా పిచ్చా? ముసలితనంలో ఇల్లాంటి లక్షణాలు వస్తుంటాయా?

అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః॥ 14-8

అలా అనుకుంటే మనదే పిచ్చౌతుంది. ముసలితనంలో అందరికీ అలాంటి లక్షణాలు రావాలని లేదు. వృద్ధాప్యానికి దైవస్మరణకు సంబంధం లేదు. క్షణక్షణం సంభవిస్తున్న అనేక పాపాలను మూటగట్టుకో కుండా వాళ్ళు వివేకంగలవాళ్ళు కాబట్టి ఎల్లప్పుడు భగవంతుణ్ణి స్మరించుకుంటున్నారు. అది మొదట చాలా కష్టమైనా, చేయగా చేయగా చాలా సులభమౌతుంది. అలా నిత్యం తనను స్మరించే భక్తునికి భగవంతుడు చేరువలో ఉంటాడు. అన్ని యిబ్బందులనుంచి కాపాడుతాడు. చిట్ట చివరకు మోక్షాన్ని కూడా ఇస్తాడు.

70. ఒకప్పుడు నేనొక రైల్లో ప్రయాణం చేస్తున్నాను. ఒకాయన రామాయణం మీద చర్చ లేవదీశాడు. 'రాముడు మన మాదిరి పుట్టిన వాడైతే అతణ్ణి దేవుడని పూజించడం దేనికి? అన్నాడు. నవనీత-గోపీ చోరుడైన కృష్ణుడూ అంతేనన్నాడు. ఇది నిజమేనా?

అవజానన్తి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్॥ 11-8

అదే మానవస్వభావం. వీలున్నంత వరకూ ఇతరుల గొప్పతనాన్ని గుర్తించక పోవడం, వీల్లేకపోతే గొప్ప వాళ్ళను గురించి దుష్ప్రచారం చేయడం. రాముడు, కృష్ణుడు కారణజన్ములు. వారు మానవుల్లో పుట్టినా మానవాతీతులని పుట్టి నప్పటినుంచి వారి

మహిమల ద్వారా తెలియ జేస్తూనే ఉన్నారు. కానీ వారూ మానవులే గదా! అని మనం వారిని అవమానిస్తూనే ఉన్నాం. ధర్మసంస్థాపన కోసం ఉద్భవించి మనకు ఆదర్శంగా, ధర్మప్రబోధం చేసిన ఆ మహనీయులు జీవులందరిలో అంతరాత్మగా ఉండి ఈ ప్రపంచ మంతా వ్యాపించి ఉన్న వాసుదేవావతారాలు గాని మానవులెలా అవుతారు? దానిని మనం మాయవల్ల గుర్తించలేం.

71. భగవంతుడు తనను శరణాగతి చేయమన్నాడు. ధ్యానించ మన్నాడు. సేవించమన్నాడు. బాగానే ఉంది. తెల్లవారి లేచి ముక్కుమూసుకొని కూర్చుంటే లోకయాత్ర ఎలా గడుస్తుంది? ఆయన మనల్ని పట్టించుకుంటాడా?

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥ 22-9

తప్పకుండా పట్టించుకుంటాడు. అయితే మనకావిశ్వాసం కావాలి. ఆయన్ని శరణాగతి చేసిన తరువాత, అంటే మనం ఆయన వాళ్ళం అయిపోయిన తరవాత, ఆయన కాకపోతే వేరెవరు పట్టించుకుంటారు? అనన్యభక్తి మనలో ఉంటే తప్పక మన యోగాన్ని క్షేమాన్ని స్వయంగా ఆయనే విచారిస్తాడు. అలా విచారించినట్లు ఎన్నో సంఘటనలుకూడా మహాత్ముల జీవితాల్లో మనం చూడవచ్చు. అలా ఆయన ప్రతిజ్ఞచేశాడు.

72. మావూళ్లో ఒక జమీందారు గుడి కట్టించాడు. ఇంకో డబ్బుగల ఆసామి రథం చేయించాడు. ఇంకొకడు ఎంతో డబ్బు ఖర్చుచేసి ఉత్సవాలు చేయిస్తున్నారు. వాళ్ళు డబ్బు కలవాళ్లు కాబట్టి చేయిస్తున్నారు. మరి నేను పూటగడవని వాణ్ణి. భగవంతునికి నేనేమి చేయించగలను? అయినా మనమిచ్చిందాన్ని దేవుడు పరిగ్రహిస్తాడా?

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥ 26-9

ప్రతివాడు గుళ్లూ గోపురాలూ కట్టించనక్కరలేదు. ఎంతో డబ్బు ఖర్చుచేసి ఆడం

బరంగా ఉత్సవాలు చేయించకపోయినా, భక్తితో చిన్న ఆకుగానీ, పువ్వు గానీ, పండు గానీ ఏదీ లేకపోతే చివరకు నీళ్లు గానీ, భగవంతుని ముందుంచి ఆయనకు నివేదనంచేస్తే, అతని భక్తికి మెచ్చి దేవుడు దాన్ని పరిగ్రహిస్తాడు. మనం భక్తితో ఇచ్చిందేదైనా దేవుడు తప్పక దాన్ని తీసుకుంటాడు. భక్తి లేకుండా ఏమి సమర్పించినా అది బూడిదలో పన్నీరు పోసి నట్లే. దాన్ని భగవంతుడు ముట్టనే ముట్టడు.

73. కొందరంటారు: రోజుకూలి చేసుకొని పట్టెడన్నం తినేవాళ్ల కెందుకండీ దేముడు? బాగా డబ్బుగల వాళ్లకి కావాలి గాని; తమ పొట్టకే అన్నంలేని వాళ్లు దేముడికేం పెడతారు? వాళ్లు దేవుణ్ణెలా పూజిస్తారు? అని. మరి పేదలు దేవుణ్ణి ఎలా సేవించాలి?

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్॥ 27-9

నిజమే! పొట్టకూడా గడవని వాళ్లు దేవుడికి పంచభక్ష్యపరమాన్నాలు పెట్టలేరు. కాని దేవుడు తనకు పంచభక్ష్యపరమాన్నాలు పెట్టమని ఎవ్వరూ అడగలేదు. నీ సేవని చేసినా, ఏమి తిన్నా, ఏది ఇతరులకిచ్చినా, ఏరకమైన తపస్సు చేసినా దానినే తనకర్పించ మన్నారు. అంతేనే కాని ఏదో ప్రత్యేకంగా చేసి తనకు సమర్పించమనలేదు. నీవు చేసే ప్రతిపనిలోను భగవదర్పణభావం రావాలి. నీవు నూకలు తింటే దాన్నే పరమాత్మకర్పించి తిను, నీ సేవని చేసినా కృష్ణార్పణబుద్ధితో చెయ్. అంతేచాలు.

74. దేవుడందరిని సృష్టించాడంటారు కదా! కొందరిని ధనికులు గాను కొందరిని దరిద్రులు గాను, కొందరిని పూర్ణాయుర్దాయంతోను, ఇంకొందరిని అల్పాయుష్యంతోను, కొందరిని అందగాళ్ళు గాను, మరికొందరిని కురూపులు గాను ఎందుకు సృష్టించాడు? ఆయనకు పక్షపాతం ఉండకూడదు కదా?

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥ 29-9

అవును! ఆయనకు పక్షపాతం ఉండ కూడదు. నిజానికి లేదు కూడా. జీవులందరి

విషయంలో ఆయన సమానభావంతోనే ఉంటాడు. ఆయనకు శత్రువు కాని మిత్రుడు కాని జీవులలో ఎవరూ లేరు. గాలి, వెలుతురు, వాన, మొ॥ వస్తువులవిషయంలో ఆయన అందఱకు సమానుడే. కానీ ఆయనవే అనన్యభక్తితో ఆరాధించే పరమభక్తులలో ఆయన నివసించి, తనలో వారిని ధరించి కాపాడతాడు. వారికి నిగ్రహం, శాంతి, సంతోషాలను, ఓర్పును కలిగించి సంసారబంధాలనుండి తప్పుకోవడానికి అనుకూల మార్గాన్ని కల్పిస్తాడు. ప్రహ్లాదుడు, ద్రౌపది మొ॥ భక్తులిందుకు ఉదాహరణాలు.

75. ఎన్నో అధర్మాలు, పాపాలు చేశాడు. దేశాన్ని దోచేశాడు. అతడు చేయని తప్పు లేదు. ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నాడు. నిరంతరం భగవద్ధ్యానం చేస్తున్నాడు. దేవుడాతణ్ణి క్షమిస్తాడా? వాణ్ణి మనమెలా చూడాలి? హిందూధర్మంలో అటువంటి వారికవకాశముందా? లేక వారు మతాంతరులై పోవలసిందేనా?

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః ॥ 30-9

ఎప్పటికీ కాదు. హిందూధర్మం మనిశాలదృక్పథం కలది. ఎన్ని పాపాలు చేసినా, నిజంగా వాడు పశ్చాత్తాప పడితే తప్పక దేవుడు వాడిని క్షమిస్తాడు. తన తప్పును తాను తెలుసుకోవడమనేది మంచిమార్గానికి మొదటిమెట్టు. అహంకారాగ్ని చల్లారితే కాని తన తప్పు తాను తెలుసుకోలేడు. అనన్యభక్తితో వాడు దేవుణ్ణి నమ్మి ఆరాధిస్తే వాడిని సమాజం మంచి వాడుగా గుర్తించి గౌరవించాలి. అతణ్ణి వెలి వేసి మతాంతరుణ్ణి చేయకూడదు అలా చేస్తే ఆ తప్పు సమాజందే అవుతుంది. మంచిదోవలో ప్రవేశించిన వాణ్ణి గౌరవించి ప్రోత్సహించాలి

76. దేవుణ్ణి నమ్మి కొలిచే భక్తులను పూర్వం వాళ్లు చేసిన తప్పులను లెక్కచేయకుండా ఆయన తప్పక కాపాడతాడా? అతడికి శాంతిని కలిగిస్తాడా?

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31-9

ముమ్మాటికీ వాళ్ళను కాపాడి తీరతాడు. తప్పులు చేసినవాడు నిజంగా పశ్చాత్తాప పడి తనను, భక్తితో ఆరాధిస్తే అతడికి మంచిమార్గంలో స్థిరపడటానికి తనే దోవ చూపిస్తాడు.

అతడు దీక్షకలవాడు కాబట్టి త్వరలోనే ధర్మాత్ముడై శాంతిని పొందగలుగుతాడు. భగవంతుడు, తన భక్తుడెన్నటికీ నశించడని ప్రతిజ్ఞచేసి చెప్పమంటున్నాడు. ఇంతకంటే మనకు అభయ ప్రదానం ఎవరు చేయగలరు?

77 దేవుని విషయంలో నిరంతరభక్తితో ఉండాలంటే భక్తుడేం చేయాలి? అలాంటి భక్తునికి స్వామి మోక్షం ఇస్తాడా?

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః॥ 34-9

తప్పకుండా ఇస్తాడు. మనకు దేవునిపై అనన్యభక్తి కలగాలంటే ఇలా మనం నడచుకోవాలని ఆయన ఉపదేశిస్తున్నాడు. ఎప్పుడూ మనమేపని చేస్తున్నా మనస్సు భగవంతునిపై నిలపాలి. అంటే మనం ఏపనిచేస్తున్నా అది భగవంతుడే చేయిస్తున్నాడనీ, ఆ పని ద్వారా మనం దేవుణ్ణి ఆరాధిస్తున్నామనీ భావిస్తూ చేయాలి. ఇలాంటి భావన ఉంటే చెడ్డపనులు చేయలేం. ఆయన మీద నిరంతరప్రేమతో ఉండాలి. అలా ఉంటే ద్వేషాన్ని జయించ గలుగుతాం. ఎప్పుడూ ఆయన్ని అనేకవిధాల ఆరాధించాలి. అలా ఆరాధిస్తే మనస్సు చెడ్డవిషయాల వలలో చిక్కుకోదు. ఆయన్నే శరణాగతి చేయాలి. అలా శరణాగతి చేస్తే అహంకారగ్రహవిముక్తి కలుగుతుంది అలాంటి భక్తునికి తప్పక ఆయన సాయుజ్యం ఇస్తానంటున్నాడు. కనుకనే ప్రాచీనులు ఏపని చేసినా భగవంతుడు చేయిస్తున్నాడనీ, దేవుడి దయవల్ల నెరవేరిందనీ, అన్ని పనుల్లో దేవుణ్ణి తీసుకవస్తుంటారు. చిలికే కొద్దీ వెన్న వచ్చినట్లు, పరిశీలించే కొద్దీ మనధర్మంలోని నిత్యసత్యాలు బయట పడతాయి.

78. భక్తుల ప్రవృత్తులెలా ఉంటాయి? మహాభక్తులకు మోక్షం కలగడానికి భగవంతుడు వారినెలా ఉద్ధరిస్తాడు? మనలో ఉన్న అజ్ఞానాన్ని, పాపాన్ని ఆయన పోగొడతాడా? అలా ఆయన పోగొట్టాలంటే మనమేం చేయాలి?

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ॥ 9-10

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే॥ 10-10

తేషామేవానుకమ్పార్థమహమజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥ 11-10

భగవంతునిపై నిండైన భక్తిగలవారు ఎల్లప్పుడూ మనస్సును ఆతనిపైనే ఉంచి, ప్రాణాలను ప్రాణశక్తిని ఆయనకే సమర్పించి, ఆయన్ను గురించి పరస్పరం ఒకరికొకరు బోధించుకుంటూ, సంభాషించుకుంటూ, సంతోషాన్ని, గొప్ప ఆనందాన్ని పొందుతుంటారు ఇలా ఎవరు మనస్సును ఇంద్రియాలను ఎన్నటికీ దేవుని లోనే లీనం చేసి, ప్రేమతో ఆయన్నే సేవిస్తారో వారికి ఆయన తనను చేరడానికి సాధనమైన సమబుద్ధిని కటాక్షిస్తాడు. అంతే గాక వారి భక్తిప్రపత్తులకు మెచ్చి, ఎలానైనా వారిని ఉద్ధరించాలని జాలితో వారికి జ్ఞాన ప్రకాశాన్నివ్వడం ద్వారా అనేకజన్మల నుంచి వస్తున్న అజ్ఞానాంధకారాన్ని నాశనం చేస్తాడు హృదయాంతర్వర్తిగా ఉండి వారి అజ్ఞానాన్ని పోగొట్టి, వారికి మంచి వివేకాన్ని, సత్ప్రవృత్తిని కలిగిస్తాడు. దాని ద్వారా వారికి మోక్షార్హత కలిగి, వారు సంసారబంధాలనుంచి ముక్తిని పొందుతారు.

79. దేవుడున్నాడా? ఉంటే చూపెట్టగలవా? అంటాడు మిత్రుడొకడు. ప్రపంచమంతా భగవంతుడుంటే ఆయన్ను మనమెలా గుర్తించేది? దీనికేదైనా ప్రమాణం ఉందా?

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ! త్వం మమ తేజోంశసంభవమ్॥ 41-10

దేవుడు తప్పకుండా ఉన్నాడు. ఆయన్ను గుర్తించడానికి అడుగడుగునా ప్రమాణాలున్నాయి. కాకపోతే మనకు ఓర్పు, మంచి అవగాహన లేవు కాబట్టి, ఆయన్ను గురించి మనం తెలిసికోలేక పోతున్నాం. చూడండి: దేవుడే, ఇలా స్వయంగా చెబుతున్నాడు లోకంలో కొన్ని పదార్థాల్లో అతిశయించిన తేజస్సు కనపడుతుంది. కొన్ని వస్తువులు చాలా అందంగా, శోభగా ఉన్నాయి. ఒక చక్కని నర్తకి మంచి నృత్యం చేస్తున్నది. ఎర్రగులాబీ అందంగా ఘుమఘుమ లాడుతుంది. పండితుడు జ్ఞానానికి పుట్టిల్లులా ఉన్నాడు. శిల్పి చక్కని శిల్పాన్ని చెక్క గలుగుతున్నాడు. వస్తువుల్లో, వ్యక్తుల్లో కనబడే ఆ అతిశయం, ఆ శోభ, ఆ శక్తి, ఆ సామర్థ్యం ఇవన్నీ మనకెక్కడివి? ఇవన్నీ

భగవంతుని అంశవల్ల మనకేర్పడినవే సహజంగా మనలో ఏమీ లేదు. ఆ భగవచ్ఛక్తి ద్వారా లోకంలో అన్నిచోట్ల మనం భగవంతుణ్ణి చూడవచ్చు. పాలల్లో మీగడలా, నువ్వుల్లో నూనెలా భగవంతుడు ప్రపంచంలో ఉన్నాడు. చూచే హృదయంతో, సాధనతో వెలికి దీస్తే కనబడతాడు.

80. దేవుడంటూ ఉంటే మనకు కనపడాలి గదా! ఎందుకని కనపడదు? చదువుకున్న వాళ్ళకి, తపస్సు చేసే వాళ్ళకి, దానధర్మాలు చేసేవాళ్ళకి, యజ్ఞయాగాలుచేసే వారికి భగవంతుడు కనపడతాడా? ఆయన్ని తెలుసుకోవాలన్నా పొందాలన్నా ఎలా సాధ్యమౌతుంది?

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥ 53-11

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥ 54-11

దేవుడు తప్పకుండా కనిపడతాడు. అయితే "నేను గొప్ప విద్యావేత్తను గదా! నాకు కనపడడేం, అంటే కనపడడు." 'నేనెంతో తపస్సు చేశాను' అనుకొనే వారికి కనపడడు. దానధర్మాలు, పూజలు పునస్కారాలు చేసే వారికీ కనపడడు. మరి ఎవరికి కనపడతాడు? ఎవరు భక్తితో ఆ స్వామి తప్ప ఇంకేమీ లేదనే భావనతో సర్వస్వాన్ని ఆయన అధీనమనుకొని భగవన్మయులుగా అవుతారో వారికే ఆయనను గూర్చి తెలుస్తుంది. ఆయన దర్శనం కలుగుతుంది ఆయన సాయుజ్యం లభిస్తుంది. కాబట్టి అనన్యభక్తి పెంచుకోవాలి.

81. మహాభక్తుణ్ణని అందరికీ చెప్పుకొనే వాడేనా నిజమైన భక్తుడు? నిజంగా భగవంతుణ్ణి పొందాలంటే భక్తుడెలా ఉండాలి? ఎటువంటి భక్తులకు భగవత్ప్రాప్తి కలుగుతుంది?

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః।
నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాండవ॥ 55-11

నిజమైన భక్తుడెప్పుడూ నేను మహాభక్తుణ్ణని డాంబికాలు పలకడు. తాను ఏది

చేస్తున్నా భగవదర్పణంగా చేస్తాడు. దేవుడే అందరికి పరమగతి అని భావిస్తాడు. ఏ రకమైన శబ్ద - రూప - రస - గంధ - స్పర్శలకోసం పాకులాడడు. అంటే వాటిపై సంగాన్ని చంపు కుంటాడు. లోకంలో ప్రతిజీవిలోను పరమాత్మనే దర్శిస్తూ ఎవరినీ ద్వేషించ లేడు అందరితో స్నేహంగా ఉంటాడు అలాంటి వాడే పరమభక్తుడు అలాంటి భక్తునికే భగవంతుడు సర్వదా సులభుడై, అతడికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు.

82. ఎలాంటివారు పరమభక్తులు? వారెలా భగవంతుణ్ణి సేవిస్తారు?

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః 2-12

ఎవరు భగవంతునియందే తత్పరమైన భావనతో మనస్సును నిలిపి శ్రద్ధతో ఉపాసన చేస్తారో వారు పరమభక్తులు కాయిక - వాచిక - మానసిక కర్మలను చేస్తూనే అవి అన్నీ భగవంతుడే చేస్తున్నాడనీ, ఆయన సంకల్పంతోనే అవన్నీ జరుగుతున్నాయనీ, తాను నిమిత్తమాత్రుడననీ భావిస్తూ, ఆ రూపంగా దేవునికి సేవ చేస్తున్నానని భావిస్తే, మనస్సు ఎప్పుడూ ఆయనపైనే నిలవడానికి వీలువడుతుంది అదే భగవంతుణ్ణి సర్వదా సేవించే పద్ధతి.

83. అనన్యభక్తితో భగవంతుణ్ణి నమ్మి సేవించే వారిని ఈ సంసార బంధాల నుంచి ఆయన సముద్ధరిస్తాడా ?

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్॥ 7-12

తప్పకుండా అటువంటి పరమభక్తులను వాళభూయిష్టమైన సంసారసముద్రంనుంచి భగవంతుడు సముద్ధరిస్తాడు. అయితే వారు సర్వకర్మలను భగవంతుని పాదపద్మాలలో సమర్పించి, ఎల్లప్పుడు భగవంతునిపైన ఆసక్తి కలిగిన మనస్సుతో, ఆయన్నే ధ్యానించాలి. తను ఏ పని చేస్తున్నా, ఏ మాట మాట్లాడుతున్నా. ఏ ఆలోచన చేస్తున్నా దాన్ని దైవకృతంగా భావిస్తూ మూడు రకాల కర్మల్లోను భగవంతుని స్మరిస్తూ, మనస్సును ఆయన లోనే ఆవేశింప చేస్తే, అటువంటి భక్తాగ్రేసరులను భగవంతుడు తనవారుగా భావించి తప్పక కాపాడుతాడు. సంసారయాతనలతని కంటను. సంసారదుఃఖాంబుధినుంచి అలాంటి భక్తులను దేవుడే ఉద్ధరిస్తాడు.

84. లోకంలో అందరు ఒకే లక్షణాలు, అర్హతలు కలవారై ఉండరు కదా! అందరికీ భగవంతుణ్ణి చేరాలంటే వారికి వారికి తగినట్లు వివిధ మార్గాంతరాలున్నాయా? ఎలా భక్తులు భగవంతుణ్ణి చేరాలి?

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥ 8-12

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥ 9-12

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।
మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి॥ 10-12

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥ 11-12

ఏ పనికైనా ఆయా వ్యక్తుల అధికారాల్ని బట్టి మార్గం ఉంటుంది. అధికారమంటే అతడి అర్హత. అందరికీ ఒకే మార్గం అంటూ ఉండదు. వారి వారి అర్హతను బట్టి మార్గాలుంటాయి. ఇందులో మొదటి మార్గం: మనస్సును ఎల్లప్పుడు భగవంతునిపైన ఉంచడం. మనకు ప్రతి క్షణం కలిగే జ్ఞానాలను భగవత్పరంగా చేయడం. అలా చేయగలిగితే మనం భగవంతునిలోనే నివసిస్తాం. ఏమీ సందేహపడవలసిన పనిలేదు. రెండవ మార్గం: ఎప్పుడూ మనస్సును ఆయనపైనే ఉంచడానికి నీకు సమర్థత లేకపోతే, అభ్యాసయోగంతో దేవుణ్ణి పొందాలని ఎప్పుడూ కోరుకో. మూడవమార్గం: అలా భగవంతుణ్ణి పొందాలని మనశ్చాంచల్యం వల్ల కోరలేకపోతే దేవుని కోసం, ఆయన ఆరాధన కోసం ప్రతి పనినీ ఆయనకు అంకితం చెయ్. స్వామి కోసం కొన్ని కర్మలు చేసినప్పటికీ నీకు సిద్ధి లభిస్తుంది. నాల్గవమార్గం: అలా భగవత్పరమైన కర్మలు చేయటానికి కూడా నీకు శక్తిలేకపోతే, భగవంతుణ్ణాశ్రయించి. ఇంద్రియ మనో నిగ్రహంతో నీవు నిత్యం చేసే కర్మల ఫలాన్ని ఆయనకు త్యాగం చెయ్. ఈ నివిధ మార్గానికి అందరూ అధికారులే. వారి వారి పనులు వారు చేసుకోవచ్చు. ఫలాన్ని భగవంతునికి వదిలివేస్తే చాలు. క్రమంగా వారికి మనోనైర్మల్యం కలుగుతుంది. దీనికి మనోనిగ్రహం కావాలి. వీటిల్లో దేన్ని ఆశ్రయించినా మోక్షం వస్తుంది.

85. లోకంలో జ్ఞానమని, ధ్యానమని, ఫలత్యాగమని, శాంతి అని కొన్నింటిని వింటున్నాం కదా! వీటిల్లో ఏది శ్రేష్ఠమైంది?

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్॥ 12 12

గుడ్డిగా అనేకసాధనలు చేయడం కంటే జ్ఞానం చాలా మంచిది. కేవలం జ్ఞానం కంటే ధ్యానం మంచిది. దానివల్ల మన మనస్సుకు ఏకాగ్రత కలుగుతుంది. ధ్యానం కంటే కర్మఫలాన్ని త్యాగం చేయడం మంచిది. కర్మఫలాన్ని భగవంతుని కర్పిస్తే అహంకారం నశించి, వైరాగ్యం కలుగుతుంది. భగవంతుని అతిమానుషత్వం గోచరిస్తుంది. మనస్సుకు శాంతి లభిస్తుంది. ఈ కర్మఫల త్యాగంకంటే దానివల్ల కలిగే శాంతి చాలా శ్రేష్ఠమైంది.

86. భగవంతునికి ఎందరో భక్తులు ఎన్నిరకాల వారో ఉంటారు. అందులో ఎటువంటి భక్తులు ఆయనకు చాలా ప్రియులుగా ఉంటారు? స్థూలంగా ఉత్తమ భక్తులకుండాల్సిన లక్షణాలేవి?

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ॥ 13-12

సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తస్స మే ప్రియః॥ 14-12

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః స చ మే ప్రియః॥ 15-12

అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః॥ 16-12

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యః స మే ప్రియః॥ 17-12

సమః శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సంగవివర్జితః॥ 18-12

తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేన చిత్।
అనికేతః స్థిరమతిః భక్తిమాన్మే ప్రియో నరః॥ 19-12

భక్తులు అనేక రకాలుగా ఉంటారు. అందులో ఉత్తమశ్రేణికి చెందిన వారు ఇలా ఉంటారు: ఏ జీవి పైనా ద్వేషం లేకుండా తనకు వారివల్ల కలిగిన బాధ తన ప్రారబ్ధకృతమని భావిస్తూ, వారి విషయంలో స్నేహాన్ని దయను నిరంతరం కలిగి ఉంటారు ఉత్తమభక్తుడు. వాడికి 'ఇది నాది' అనే మమకారం గాని, 'ఇది నేను చేస్తున్నానే' అహంకారం గాని ఉండదు దుఃఖాన్ని సుఖాన్ని అతడు ఓర్పుతో సమానంగా సహిస్తాడు. భగవత్ప్రసాద మని స్వీకరిస్తాడు. ఎప్పుడూ తృప్తితో, మనోనిగ్రహంతో, తన జీవితలక్ష్యాన్ని, కర్తవ్యాన్ని నిశ్చయించుకొని మనస్సును, బుద్ధిని, జీవితాన్ని భగవదర్పణం చేసి లోకయాత్ర చేస్తూ ఉంటాడు. అతడే దేవునకు చాల ఇష్టుడైన భక్తుడు కామం-క్రోధం-లోభం-మోహం-మదం-మాత్సర్యం అనే అంతశ్శత్రువులను ఆరుగురను జయించడంవల్ల, ఎవరివల్ల లోకం భయపడదో, ఎవరు లోకంవల్ల కూడా భయపడరో, సుఖ దుఃఖాలు భయోద్వేగాలు ఎవరిపైన ఏ రకమైన ప్రభావాన్ని చూపవో, అతడే భగవంతునికి ప్రియమైన భక్తుడు. ఏ అపేక్ష లేక, ఆచారం కలవాడై, సమర్థుడై, తనకు కలిగే మంచిచెడుల విషయంలో తటస్థుడై యుండటం వల్ల ఏ చింత లేనివాడై, ఫలాపేక్షతో ఏ కార్యాన్ని ఆరంభించకుండా తన కర్తవ్యాన్ని మాత్రం జాగ్రత్తగా నిర్వహిస్తూ ఉండే భక్తుడే భగవంతునకు ప్రియుడు.

ఎవరు మంచి కలిగితే పట్టలేని సంతోషాన్ని పొందరో, ఏదైనా చెడు కలిగితే దుఃఖ పడరో, రాగద్వేషాలు ఎవరిపైన ప్రభావాన్ని చూపలేవో, మంచి - చెడులను, పుణ్య పాపాలను ఎవరు దేవునకే వదలి కర్తవ్యతాబుద్ధితో కర్మల్ని ఆచరిస్తారో వారు భగవంతునకు ఇష్టులైన భక్తులు.

ఎవరు శత్రువుల పైన మిత్రుల పైన, సన్మానములలో, అవమానములలో, శీతోష్ణ స్పర్శలలో, సుఖ-దుఃఖాలలో, నిందా-స్తుతులలో సమానమైన భావన గలిగి, ఇష్టమైన సైవిష యాలు అందుబాటులో లేనప్పుడు లేనే అవి బాధపడకుండా, వాటిపై ఆసక్తిని వదలి, మౌనంగా ఏది లభించినా దానితో సంతోషాన్నే పొందుతూ, ఒకచోట స్థిరంగా ఉండక, స్థిర మైన బుద్ధిగలవారై ఉంటారో వారు భగవంతునికి చాల ఇష్టుడు ఇటువంటి భక్తులు ఉత్తమోత్తములు కనుక స్వామి వారి వెల్లప్పుడు వెన్నంటి కాస్తూ, వారికి వచ్చిన బాధ లను తనంతట తానే కల్పించుకొని నివారిస్తూ, వారిని కాపాడి మోక్షాన్నిస్తారు.

87 మన సమాజంలో జ్ఞానులకెంతో ప్రాధాన్యం ఉంది కదా! జ్ఞాన స్వరూపం ఎలా ఉంటుంది? జ్ఞాని మనస్తత్వమెలా ఉంటుంది?

అమానిత్వమదంభిత్వమహింసా క్షాన్తిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥ 8-13

ఇన్ద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥ 9-13

అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥ 10-13

మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వమరతిర్జనసంసది ॥ 11-13

అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏతద్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా ॥ 12-13

'నేను చాల గొప్పవాడినని', 'నేను ఇతరుల కెందులోను తీసిపోనని' దురభిమానం లేకపోవడం, నా ఆస్తి, నా ఐశ్వర్యం, నా విద్య, నా సుఖ భోగాలు ఎంత గొప్పవో చూడమని ఆడంబరం కోసం అతిశయోక్తులు పలక్కపోవడం, శారీరక-మానసిక-వాచికాలైన హింసలను చేయకుండా అహింసను పాటించడం, ఓర్పు కలిగియుండడం, కపటం లేకపోవడం, గురువులను సేవించడం, పరిశుభ్రంగా ఉండడం, మనస్సును అదుపు ఆజ్ఞలలో ఉంచుకోవడం, మన ఇంద్రియాలను కుంగదీసే రూప-రస-గంధ-స్పర్శ-శబ్దాలనే లౌకిక విషయాలపై ఆసక్తి లేకపోవడం, అహంకారరాహిత్యం, జననం-మరణం-ముసలితనం-ఆధివ్యాధులనే దుఃఖహేతువులుకలది ఈ జీవితంఅని భావన చేయడం, సంతానం, భార్య, ఇండ్లు, ఆస్తిపాస్తుల విషయంలో మమకారం కాని, ఆసక్తి కాని లేకపోవడం, తన ఇష్టం నెరవేరినా, అలా నెరవేరక అనిష్టం కలిగినా మనస్సు సమానమైన స్థితిలో ఉండటం, భగవంతునిపై నిశ్చలమైన, అనన్యమైన భక్తి కలిగి ఉండడం, పది మందిలో కలసి ఉండక ఒంటరిగా ఉండటం, విభిన్నస్వభావాలు కల జన సమూహంతో స్నేహం చేయటానికి ఇష్టపడక పోవడం, ఎప్పుడూ ఆత్మజ్ఞానాన్ని కలిగి ఉండటం, తత్త్వజ్ఞానస్వరూపాన్ని చక్కగా అవగాహన చేసుకోవడం, ఇవి జ్ఞానానికి లక్షణాలు. ఇలాంటి లక్షణాలు గల మనస్తత్వం కలవాడే జ్ఞాని. వీటిలో ఏ ఒక్కదాన్ని అభ్యాసం చేసినా సమాజం సుఖ శాంతులతో తుల తూగుతుంది. వీటికి పూర్తిగా విరుద్ధమైన లక్షణాలే అజ్ఞానం. వాటి వల్లనే సమాజంలో శాంతిలేక ప్రతివాడూ బాధపడేది.

88. మనలో సత్త్వ-రజ-స్తమోగుణాలున్నాయి కదా! ఈ మూడు గుణాల ప్రభావాలకు లొంగని వారెవరైనా ఉంటారా? ఉంటే వారి మనస్తత్వం, ప్రవృత్తి ఎలా ఉంటాయి?

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి। 22-14

ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే॥ 23-14

సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః॥ 24-14

మానాపమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే॥ 25-14

తప్పకుండా ఉంటారు. సత్త్వగుణ లక్షణం ప్రకాశం. రజోగుణ లక్షణం కార్యప్రవృత్తి తమోగుణ లక్షణం అజ్ఞానం. ఇవి ఏవి ఎలా కలిగినా లెక్కచేయక, రాగద్వేషాలను వదలి, ఉన్నదాన్ని అక్కర్లేదని కానీ, లేనిది కావాలని కానీ కోరకుండా, తటస్థంగా ఉండి, ఎవరు గుణాలచేత ఏ కొంచెం చాంచల్యం పొందకుండా ఉంటారో, ప్రకృతిగుణాలు తమస్వభావంతో ఉంటున్నాయని అనుకుంటూ స్థిరంగా ఉండి, ఆసక్తి లేక, సుఖదుఃఖాలు, ఇష్టానిష్టాలు, నిందాస్తోత్రాలు, సమ్మానావమానాలు, శత్రువులు మిత్రులు ఇటువంటి ద్వంద్వాల విషయంలో సమానమైన భావం కలవారై, ధీరులై, స్థిరచిత్తంతో, రాయి, బంగారం, మట్టి వీటిని సమానంగా భావిస్తూ, తమకు తాముగా ఏ పనిని ప్రారంభించక, కర్తవ్యాన్ని శ్రద్ధతో నిర్వహిస్తారో వారు గుణాతీతులౌతారు. సత్త్వ-రజ-స్తమోగుణాల ప్రభావాలు వారిపై పని చేయవు కాబట్టి, వారు గుణాతీతులు. పై చెప్పిన మనస్తత్వంతో ప్రవర్తిస్తూ ఉంటారు వారు

89. మనం గుణాతీతస్థితిని సంపాదించాలంటే సాధ్యమవుతుందా? ఎలాంటివారు గుణాతీతస్థితిని పొందుతారు?

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥ 26-14

ఎందుకు సాధ్యం కాదు? అనన్యమైన భక్తితో భగవంతుణ్ణి ఎవరు సేవిస్తారో వారికి

ఈ గుణాతీత స్థితి, తప్పక కలుగుతుంది. వారు పై గుణాలకు లేక గుణకార్యాలకు లోబడరు. వారికి పరబ్రహ్మ సాయుజ్యం కలుగుతుంది.

90. భగవంతుడి నుంచే జీవుడేర్పడ్డాడా? అలాంటప్పుడు మన స్పెందుకని ఇలా చెడు దోవలు పడుతుంది? ఎంత ప్రయత్నం చేసినా అదుపులోకి రావెందుకని?

మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః ।
మనఃషష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ 7-15

ఈ ప్రపంచంలో భగవంతుని అంశే జీవభావాన్ని పొంది అనాదికాలంనుంచి ప్రకృతి వికారాలైన మనస్సును, కన్ను-ముక్కు-చెవి-నాలుక-చర్మమనే అయిదు జ్ఞానేంద్రియాలను ఆకర్షిస్తున్నది. భగవంతుడు అంశి. అంటే అంశలు గలవాడు. జీవుడు అతడికి అంశభూతుడు. ప్రకృతి నుంచి ఏర్పడ్డ మనస్సు ప్రాచీన సంస్కారాల పుట్ట. మలినమైంది. అందువల్లనే జీవుడు సంసార చక్రంలో తిరుగుతున్నాడు. మనస్సును నిగ్రహించడం ద్వారానే మోక్షం సిద్ధిస్తుంది. అది అభ్యాసం వల్ల కాని అదుపులోకి రాదు.

91. నాస్తికుడంటాడు: "అన్నిటికీ దేవుడు దేవుడంటావు. ఏం చేస్తున్నాడాయన? బాగా పూజలు నమస్కారాలు అందుకుంటూ కూర్చుంటున్నాడు. మానవుడు చంద్రమండలాని కెగిరి వెళ్ళాడు. ఇతరగ్రహాల వరకు పోతున్నాడు. ఎన్నో పనులు సాధించాడు. మనం ఇన్ని ఘనకార్యాలు సాధిస్తుంటే ఎందుకు అన్నింటికీ దేవుణ్ణి పొగుడుతావు. నేను దేవుడిమీద ఆధారపడను. నేనే అన్నీ సాధిస్తాను" అని. అంతేనా? దేవుడేమైనా చేస్తున్నాడా?

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ 12-15
గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా ।
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ॥ 13-15

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥ 14-15
సర్వస్య చాఽహం హృది సన్నివిష్టః
మత్తః స్మృతిః జ్ఞానమపోహనం చ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః
వేదాన్తకృద్వేదవిదేవ చాఽహమ్॥ 15-15

మీ మిత్రుడు చాలా పొరపాటు పడుతున్నారు. దేవుడు ఏమీ చెయ్య కుండా ఉంటే సృష్టే లేదు. రాత్రిం బవళ్ళు లేవు. లోకంలో స్వయంగా ప్రకాశించే శక్తి భగవంతుని కొక్కడికే ఉంది. మిగత వస్తువులన్నీ ఆయన వెలుగువల్ల నామరూపాలను పొందు తున్నాయి. సూర్యుడు లోకాన్ని ప్రకాశింప జేస్తున్నాడు. చంద్రుడు లోకాన్ని ఆహ్లాద పరుస్తున్నాడు, అగ్ని వెలుగును ఇస్తున్నాడు. ఎక్కడిది వారికి వెలుగు? భగవంతుని ప్రకాశమే వారి ముగ్గురిలో మనం చూస్తున్నాం. ఆయన వెలుగు నివ్వకపోతే వారు కూడా స్వయంగా ప్రకాశించ లేరు. భూమిలో భగవంతుడు ప్రవేశించి తన శక్తితో ఈభూతజాలాన్ని మోస్తున్నారు. లేక పోతే మీ భూగోళం దేనిమీద ఆధారపడి ఉంది? ఇంతమంది జీవులు దీనిపై ఎలా బ్రతుకుతున్నారు? చంద్రుడుగా దేవుడుండి తన కిరణప్రసారం ద్వారా ఓషధులను, వృక్షాలను, సస్యాలను బాగా పెంచుతున్నాడు. అంతవరకెందుకు? దేవుడు మన శరీరాల్లో జఠరాగ్నిరూపంలో ఉండి ప్రాణాపానాది వాయువులతో కూడి, నమిలి తిన వలసిన మనపదార్థాలైన భక్ష్యాలు, 2 త్రాగేటువంటి పల్చని ఆహారాలైన భోజ్యాలు, 3. పల్చగా ఉండి చప్పరించి తినవలసిన లేహ్యాలు 4. రసాన్ని పీల్చవలసిన చోష్యాలనే నాల్గు రకాల ఆహారాలను జీర్ణింప చేస్తున్నాడు. కాబట్టి మనం తినే ఆహారం ఆకలిరూపంలో ఉన్న పరమేశ్వరార్పణంగా తినాలే గాని, 'మనం తింటున్నాం' అనుకుంటూ తినకూడదు. అందుకనే తల్లులు పిల్లలకు 'ఇది రాముడి ముద్ద', 'ఇది కృష్ణుడి ముద్ద', అని దేవుణ్ణి స్మరిస్తూ అన్నం పెట్టడం మనం చూస్తుంటాం. దేవుడు అంతరాత్మగా అన్ని జీవుల హృదయగుహల్లో ఉన్నారు. ఆయన వల్లనే జీవులకు స్మరణం, జ్ఞానం, మరచిపోవడం, కలుగుతున్నది. వేదాలచే తెలియబడే వాడు దేవుడే. వేదాన్తకర్త, వేదాలను తెలిసికొనే వాడు కూడ భగవంతుడే. అంటే తెలిసికొనే వాడు తెలిసికోబడే వస్తువు, తెలిసికోవడం కూడా భగవంతుడే అని తెలిసి కోవాలి. కాబట్టి దేవుడు పూజలు చేయించుకుంటూ కూర్చోలేదు. మానవుడు సాధించిన ప్రగతిలో వెనుక దేవుని అండదండ లున్నాయనీ, ఆయన ఆజ్ఞ లేకపోతే,చీమైన కదలదని, అహంకారంతో మానవుడు నేను చేస్తున్నానను కుంటున్నాడని మీ మిత్రుడితో మర్చిపోకుండా చెప్పండి.

92. లోకంలో మనం విభిన్న మనస్తత్వాలు ప్రవృత్తులు కలవాళ్లని చూస్తుంటాం కదా! దైవీసంపదలో పుట్టినవాళ్లు ఎలా ఉంటారు? వారిలో ఎలాంటి గుణగణాలుంటాయి?

అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥ 1-16

అహింసా సత్యమక్రోధః త్యాగః శాన్తిరపైశునమ్ ।
దయా భూతేష్వలోలుత్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥ 2-16

తేజః క్షమా ధృతిః శౌచమద్రోహో నాతిమానితా ।
భవన్తి సంపదం దైవీమభిజాతస్య భారత ॥ 3-16

భయం లేకపోవడం, సత్యగుణం కలిగి ఉండడం, జ్ఞానయోగవ్యవస్థ, దానం, ఇంద్రియనిగ్రహం, దైవారాధన, జ్ఞానసముపార్జన, తపస్సు, కపటం లేకపోవడం, అహింస, సత్యభాషణం, కోపం లేకపోవడం, త్యాగం, శాంతి, మొండితనం లేకపోవడం, జీవులందరిపై దయ, విషయాలలో వ్యసనం లేకపోవడం, మృదుస్వభావం, వినయం, చిత్తచాపల్యం లేకపోవడం, తేజస్సు, ఓర్పు, ధైర్యం, శరీరానికి మనస్సుకు సంబంధించిన పరిశుద్ధి, ద్రోహచింత లేకపోవడం, తాను చాలా కులీనుడననో, ధనికుడననో, అందగాడిననో, విద్యావంతుడననో, బలవంతుడననో దురభిమానం లేకపోవడం, ఇవన్నీ దైవీ సంపదలో పుట్టినవారి కుండే సహజగుణాలు. అందువల్లనే వారి ప్రవృత్తి దివ్యంగా ఉంటుంది. ఆదర్శంగా ఉంటుంది. మనదేశ చరిత్రలో చిరస్థాయిగా నిలబడ్డ మహాపురుషుల్లో ఈ గుణాలను మనం చూడవచ్చు.

93. కొందరు పలకరిస్తే కరవొస్తారు. వారి గొప్ప తప్ప ఇంకొకరి మాట చెవిపెట్టరు. వీరు ఏ సంపదలో పుట్టినవారు? వారి గుణాలేమిటి?

దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్ ॥ 1-46

వారే ఆసురీసంపదలో పుట్టినవారు. వారు డంబాచారాలకు, ఆడంబరాలకు, గర్వానికి, దురభిమానానికి, కోపానికి, దురుసుగా మాట్లాడడానికి, అజ్ఞానానికి పుట్టిల్లులాంటి

వారు. వారు చెప్పేది తప్ప ఇంకోమాట చెవిని వేసుకోరు. వారు సుఖంగా బ్రతకరు. ఇతరులను సుఖంగా బ్రతకనివ్వరు.

94. దైవీ ఆసురీ అనే సంపదల వల్ల మనకేం కలుగుతుంది? వీటికీ మన జీవితానికి ఏమైనా సంబంధం ఉందా?

దైవీసంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా ।
మా శుచః సంపదం దైవీమభిజాతోఽసి పాండవ ॥ 5-16

ఎవరు దైవీసంపదలో పుట్టి దాన్నే పెంచుకుంటారో, వారు మోక్షానికి అర్హులౌతారు. ఎవరు ఆసురీ సంపదలో పుట్టి దాన్ని బాగా పెంచుకుంటారో, వారు సంసార బద్ధులై ఈ వలయంలో పుడుతూ చస్తూ తిరుగుతుంటారు.

95. "దేవుడు లేడం"టారు కొందరు. "ఆచారం గీచారం లేదు, ఇదంతా చాదస్త" మంటారు మరి కొందరు. ఎప్పుడూ చికాకు పడుతుంటారు ఓ కొందరు. వీరందరినీ చూస్తుంటే జాలి కలుగుతుంది. వీరేరెతెగకు సంబంధించిన వారు? వీరి ప్రవృత్తులెలా ఉంటాయి?

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ 7-16

అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్ ॥ 8-16

ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ 9-16

కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥ 10-16

చిన్తామపరిమేయాం చ ప్రలయాన్తాముపాశ్రితాః ।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥ 11-16

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్ ॥ 12-16

వీరందరు ఆసురీ సంపదలో పుట్టినవారు. అందుకనే వారి ఆలోచనలన్నీ అలా వుంటాయి. వారికి ప్రవృత్తి-నివృత్తి మార్గాలని రెండు మార్గాలున్నాయని కూడా తెలియదు. ప్రవృత్తి అంటే పరమాత్మకు అంశభూతుడైన జీవుడు ప్రకృతివశుడై సంసారంలోకి పోవడం. నివృత్తి అంటే వెనకకు వెళ్ళడం. సంసారంలో విసుగుపడినవారు మరల ముముక్షువై, ముక్తుడై పరమాత్మ సాయుజ్యాన్ని పొందడం. ఈ ఆసురీ సంపదలో పుట్టినవారికి పరిశుద్ధంగా ఉండటం, మంచి నడవడి కలిగి ఉండటం, నిజమే పల్కడం అంటే గిట్టదు. 'ఈ ప్రపంచ మంతా మిథ్య' అని, నిలకడ లేనిదని, సృష్టికర్త అయిన దేవుడెవ్వరు లేడని, ఈ ప్రపంచోత్పత్తిలో కార్యకారణభావమేదీ లేదని, కామాధిక్యంవల్ల కలిగిన స్త్రీ పురుష సంయోగం వల్లనే ఈ సృష్టి జరుగుతున్నది కానీ, పుణ్య పాపాల్లాంటి ఇతర కారణాలేవీ లేవని, వారి సిద్ధాంతాలు. ఇలాంటి ఆలోచనలతో వారు నిత్యమైన ఆత్మ లేదనుకొని, ఆత్మ సంస్కారాలు, ఆత్మశక్తి, లేకుండా నీచమైన బుద్ధులతో, అతి భయంకరమైన పనులు చేస్తూ, క్రూరంగా ప్రపంచాన్ని నాశనం చేస్తుంటారు. ఎన్నటికీ తృప్తినందని కామాన్ని ఆశ్రయించి, అడంబరం, అభిమానం, మదం మొదలగు దుర్గుణాలతో, అజ్ఞానంతో అనేక విషయాలలో భ్రమ పడి, నీతి నియమాలు లేకుండా సంచరిస్తుంటారు. అంతులేని చింతలతో, కామంతో, కారి రకమైన సౌఖ్యాలను అనుభవించడమే జీవిత లక్ష్యమనుకొని, అంతకంటే జీవితంలో తాము సాధించవలసిందేమీ లేదని గట్టిగా నిశ్చయించుకొని, ఇవీ అవీ అనడానికి వీలులేనన్ని ఆశాపాశాలతో బద్ధులై, కామ-క్రోధాలకు దాసులై, తమ స్వేచ్ఛా భోగానుభవాలకు కావలసిన డబ్బును, ఎంత నీచమైన మార్గాల గుండా అయినా సరే, అన్యాయాలు, అక్రమాలు చేసి సంపాదించాలని ఎన్నో ప్రయత్నాలు చేస్తుంటారు. కనుక వీరిని మనం ఒక కంట కనిపెట్టి ఉండాలి. వీలున్నంత వరకు వారి ప్రభావాలు మనమీద పడకుండా చూసుకోవాలి.

96. "నేను దీన్ని సంపాదించాను. ఇంకా ఇంత సంపాదించాలి. నేను వాణ్ణి నాశనం చేశాను. దేవుడూ లేడు, దయ్యం లేదు. నేనే దేవుణ్ణి. మా వంశం చాలా గొప్పది. నాలాంటి వాళ్ళెవరున్నార"ని, సమాజంలో మన చుట్టూ ఎన్నో మాటలు వినపడు తుంటాయి. ఇవి మంచి ఆలోచనలేనా? ఇలా ఆలోచించే వారు

ఏ తెగకు చెందుతారు? ఇలాంటి ఆలోచనలు గల వారి ప్రవృత్తులెలా ఉంటాయి?

ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥ 13-16

అసౌ మయా హతః శత్రుర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ॥ 14-16

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః॥ 15-16

అనేకచిత్తవిభ్రాంతాః మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥ 16-16

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్॥ 17-16

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥ 18-16

ఇలా ఆలోచించేవారు అసురీ సంపదకు, అంటే రాక్షససంపదకు సంబంధించిన వారే. వీరు అహంకారంతో నిండిపోయి "నేనివ్వాళ ఇది సంపాదించాను. నా లక్ష్యం ఇంత సంపాదించడం. అది వెరవేరే వఱకు నిద్రపోను. నాకెంత సిరిసంపద లున్నాయో తెలుసా? ఈ సంవత్సరం ఇంకెన్ని లాభాలో వస్తాయి. ఈ ప్రపంచంలో నన్ను మించిన ధనికుడెవడూ లేడు". అని అనుకుంటూ ఉంటారు. ఇంకొందఱు "వాడు నాతో శత్రుత్వం పెట్టుకొని బ్రతక గలడా! ఇవాళ, వాణ్ణి చంపాను. మిగతా శత్రువులను గూడ చంపి పారేస్తాను. ఈ లోకానికి నేనే రాజును. నా కంటే ఈ లోకంలో సమస్త భోగాలను అనుభవించే వాడింకొకడెవడూ లేడు నేనెంతో అదృష్టవంతుణ్ణి. సిద్ధపురుషుణ్ణి నేను. నామాదిరి బలవంతులు గాని, సుఖపురుషులు గాని ఇంకోరు ఎవరూ లేరు, అంటారు." వీరిలో మఱికొందఱు " నేను చాల సమర్థుణ్ణి. గొప్పకులంలో పుట్టాను. నాలాంటి వాడింకోడెవడైనా ఉన్నాడా? నేను ఎన్నో యజ్ఞయాగాలు దానాలు చేస్తాను. ఎంతో ఆనందాన్ని పొందుతాను" అని అనుకుంటూ అజ్ఞానంలో పడి ఉంటారు. ఈ మాయతో వారు ఎన్నో భ్రమలకు లోనడి, మోహపు రంగులవలల్లో చిక్కుకుపోయి, కామోపభోగానుభవంలో ఆసక్తులై, అతి భయంకరమైన నరకకూపంలో పడతారు. హద్దు మీరిన ఆత్మాభిమానంతో, ధన - మద

గర్వంతో, ఆడంబరంతో పేరు ప్రతిష్ఠలకోసం ఎన్నోయజ్ఞాలను, పవిత్రకార్యాలను చేస్తుంటారు. అహంకారంతో, కామ-క్రోధాలతో బలవంతుణ్ణనే గర్వంతో, తమ దేహం లోను, ఇతరుల్లోను అంతర్యామిగా ఉన్న దేవుణ్ణి గుర్తించలేక, అసూయతో ఇతరులను ద్వేషిస్తూ ఉంటారు.

97. దైవద్వేషం, మానవద్వేషం, అహంకారం కల వారి గతి ఏమిటి? వారిలానే సంసారచక్రంలో తిరుగుతూ ఉండాల్సిందేనా?

తానహం ద్విషతః క్రూరాన్సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥ 19-16

ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్ ॥ 20-16

ఇలా రాక్షస సంపదలో పుట్టి, క్రూరులై సంచరించే అలాంటి నరాధములను భగవంతుడు మళ్ళా అమంగళకరమైన రాక్షసప్రవృత్తికల జన్మలలోనే పడవేస్తాడు. ఇలాంటి రాక్షస సంపదలో పుట్టి పుట్టి, పెరిగి పెరిగి, మూర్ఖత పెచ్చుపెరిగి పోగా, భగవంతుణ్ణి పొందాలనే ఆలోచనైనా రాక, నికృష్టమైన నీచజన్మలను పొందుతారు. ఎంతో పుణ్యంచేసి సంపాదించుకున్న మానవజన్మ ప్రయోజనం పొందకుండానే తిరిగి నికృష్టాలైన పశు-పక్ష్యాది నీచజన్మల నెత్తుతారు.

98. ఏదో ఒక వస్తువు కావాలని కామం, అది దొరక్కపోతే క్రోధం, అయ్యో అయిపోతుందేమో నని లోభం, నాలో ఎక్కువగా ఉంటాయి. ఇలా ఉండటం మంచిదేనా?

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥ 21-16

ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారైస్త్రిభిర్నరః ।
ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్ ॥ 22-16

మంచిదని ఎవరంటారు? ఆత్మనాశంవల్ల పొందే నరకమహానగరానికి మూడు ద్వారాలున్నాయి. మొదటిది కామం. రెండవది క్రోధం. మూడవది లోభం. అంటే

ఎవరు ఆత్మవాశాన్ని పొందాలన్నా ఈ మూడింటిలో ఏ ఒకద్వారం ముంచైనా పొంద డానికి వీలుంది. కాబట్టి వివేకం గలవారు ఈ మూడు నరకద్వారాల జోలికి పోకూడదు. అలా పోక పోతే ఆత్మశక్తిని పుంజుకొని, శ్రేయోమార్గాన్ని అవలంబించి పరమపదాన్ని పొందుతారు.

99. మనం పెద్దవాళ్లు చెప్పినట్లు ఎందుకు నడవాలి? ప్రాచీనులు చెప్పినట్లు, మనధర్మం శాసించినట్లు ఈకాలంలో నడవడానికి వీలు పడుతుందా? మన యిష్టం వచ్చినట్లు కర్మలు చేస్తే ఏమవుతుంది?

యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః।
న న సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిమ్॥ 23-16

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి॥ 24-16

మన ధర్మం అన్ని కాలాలకు అందుబాటులో ఉండేదే. దానికి పాతబడి పోవటం అనేది లేదు. ఇక పెద్దవాళ్లు చెప్పినట్లు, లేక శాస్త్రాలు శాసించినట్లు నడవకుండా, వాటిని పెడచెవిన పెట్టి స్వేచ్ఛగా నడిచే వాళ్లు కార్యసిద్ధిని పొందలేరు. వారికి ఈ లోకంలో సుఖం కాని, పరలోకంలో మోక్షం గాని లభించదు. కనుక ప్రతివాడికీ ఏదో ఒక నియమం, ఏదో ఒక ఆదర్శం, పెద్దవాళ్ల మాటల మీద విశ్వాసం తప్పక ఉండాలి. అలా ఉంటే అతడు దేనినైనా సాధించగలుగుతాడు.

100. మనలో ఒక్కొక్కడి ప్రవృత్తి ఒక్కొక్క రకంగా ఉంటుంది. ఒక తల్లికి పుట్టిన బిడ్డలు అందఱూ, ఒకే రకమైన శ్రద్ధ కలవారుగా ఉండరు. ఏమిటి కారణం? స్వభావాలిలా ఎందుకు వేఱు వేఱుగా ఉంటాయి?

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శ్రుణు॥ 2-17

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః॥ 3-17

మనమంతా మానవులమే. కాని మనలో వాసనలు, అంటే సంస్కారాలు భిన్న భిన్నంగా ఉంటాయి. ఆ వాసనలవల్ల ఒక్కొక్కరి స్వభావం ఒక్కొక్కరకంగా ఉంటుంది. విభిన్న స్వభావాలుకల మన అందరిలో పుట్టుకనుంచి సాత్త్విక-రాజస-తామసాలని మూడు రకాల శ్రద్ధలుంటాయి. మనలో ఎవరికి ఎలాంటి శ్రద్ధ కలిగినా అది వారి స్వభావాన్ని బట్టే కలుగుతుంది. అసలు మానవుడు శ్రద్ధాస్వరూపుడు. వారి శ్రద్ధను బట్టే వారి ఆలోచనలు, ప్రవృత్తులు ఉంటాయి. కనుక చూడటానికి అందరు ఒకేలా కనబడ్డా, వారి లోపలి ప్రపంచాలు వేరు వేరుగా ఉంటాయి. వారి సంస్కారాలను బట్టి స్వభావాలు, స్వభావాలను బట్టి శ్రద్ధలు, శ్రద్ధలను బట్టి ప్రవృత్తులు, ప్రవృత్తులను బట్టి వారు సాధించే ఫలితాలు ఉంటాయి.

101. కొందరు సమాజంలో దైవాంశసంభూతులైన రామకృష్ణాదులను ఆరాధిస్తారు. ఇంకొందరు యక్షిణి, రాక్షసులను ఉపాసిస్తారు. మరి కొందరు భూత-ప్రేతాలను కొలుస్తారు. దీన్నిబట్టి వీరి శ్రద్ధలను నిర్ణయించవచ్చా?

**యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।**
**ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః॥ 4-17**

తప్పకుండా నిర్ణయించవచ్చు. సాత్త్విక శ్రద్ధ కలవాళ్ళు రామకృష్ణాది సాత్త్విక దేవతలను ఆరాధిస్తారు. రాజసశ్రద్ధకల వాళ్ళు యక్షులను, యక్షిణిలను, రాక్షసులను వశపరచుకోవడానికి తగిన ఉపాసనలు చేస్తుంటారు. తామస శ్రద్ధ కలవాళ్ళు భూత-ప్రేతాలను కొలుస్తుంటారు. కనుక వారి అభిరుచులను బట్టి, వారి శ్రద్ధలను మనం అర్థం చేసుకోవచ్చు.

102. మానవుల్లో సాత్త్వికులు, రాజసులు, తామసులు అని వారి వారి స్వభావాలను బట్టి అంటాం కదా! వారి వారి ఆహారాలెలా ఉంటాయి?

**ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః। 7-17**
**ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః।**
**రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః॥ 8-17**

**కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః।**
**ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకభయప్రదాః॥ 9-17**

**యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్।**
**ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥ 10-17**

లోకంలో వాళ్ళ వాళ్ళ స్వభావాలను బట్టి మూడు రకాలైన ఆహారాల మీద ఇష్టం కలుగుతుంది. ఆయుష్యాన్ని, బుద్ధిబలాన్ని దేహబలాన్ని, ఆరోగ్యాన్ని, సుఖాన్ని, సంతోషాన్ని పెంపొందించేటువంటి, రసభరితాలు, శైలవక్వాలు, ఆకలి తగ్గించి వేసేటువంటి హృద్యాలైన ఆహారాలు సాత్వికులకు ఇష్టమైనవి. బాగా కారం పులుపు, ఉప్పు, చేదు రుచులు కలవి, హెచ్చు వేడిగా ఉండేవి, ఉద్రేకాన్ని కలిగించేవి, కడుపుమంట పుట్టించేవి, దాహాన్ని కలిగించేవి అయిన ఆహారాలు రాజసులకు ప్రియమైనవి. వీటివల్ల దుఃఖం శోకం, రోగం కలుగుతుంది. ఎప్పుడో వండటం వల్ల చల్లారిపోయినది, ఎండిపోయి రుచిలేనిది, పాసిపోయి వాసన కొట్టేది, నిలువ ఉన్నది, ఎంగిలిది, అపవిత్రమైంది అయిన ఆహారం తామసులకు నచ్చుతుంది. కొందరికి ఈపై చెప్పిన పదార్థాలు బాగా ఇష్టంగా ఉంటాయి. అలాంటి వాటి మీద వాళ్లకు ఇష్టం కలగాలంటే లోపలిస్వభావం దానికనుకూలంగా ఉండాలి. స్వభావాలను బట్టే వారికి అభిరుచులేర్పడతాయి.

103. లోకంలో అనేకమంది అనేకరకాలుగా వారి వారి ఇష్టదైవాలను పూజిస్తుంటారు. కొందరికి ఫలాపేక్ష ఉండదు. కొందరికి ఫలాపేక్ష ఉంటుంది. మరి కొందరికి శ్రద్ధ గాని, శాస్త్రనియమాలు కాని ఉండవు. వీటిని బట్టి వారి ఆరాధనలను మనం వేఱుగా అనుకోవచ్చా?

**అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।**
**యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః॥ 11-17**

**అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్।**
**ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్॥ 12-17**

**విధిహీనమసృష్టాన్నం మన్త్రహీనమదక్షిణమ్।**
**శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥ 13-17**

ఉద్దేశ్యాల ననుసరించి వారి ఆరాధనలను మనం విభజించవచ్చు. శాస్త్రోక్తమార్గంలో ఫలాపేక్ష లేకుండా ఇది నా కర్తవ్యమనే భావనతో, సమాధానం పొందిన మనస్సుతో చేయబడే ఆరాధనం లేక యజ్ఞం సాత్త్వికమవుతుంది. ఫలాన్ని ఉద్దేశించి గాని లేక ఆడంబరంగా గాని పేరు ప్రతిష్ఠలను పొందాలని గాని చేసే యజ్ఞం రాజస మనబడుతుంది. శాస్త్రమర్యాదల నుల్లంఘించి, అన్నదానం లేక, మంత్రోచ్చారణం సరిగా లేక, అథ వా మంత్రాలే లేక, ఋత్త్విక్కులకు దక్షిణలే ఇవ్వక, చేసే యజ్ఞం తామసమవుతుంది. వారి వారి స్వభావాలను బట్టి వారు ఈ మూడురకాల ఆరాధనలను చేస్తుంటారు. వానిని గుర్తించి, వారి ప్రవృత్తుల ప్రభావాలకు గురిగాకుండా, యోగ్యమైన మార్గాన్నుంచి భ్రష్టుడు కాకుండా నడచుకోవాలి.

104 లోకంలో అనేకరకాల తపస్సు చేసేవారున్నారు. ముక్కు మూసుకొని కొంగజపం చేసేవారూ ఉన్నారు. ఉత్తమమైన తపస్సెన్ని రకాలు? అరణ్యాలకు పోయి తపస్సు చేయకుండా సంసారంలో చేయగలిగిన తపస్సులు ఎలా ఉంటాయి?

దేవ ద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే॥ 14-17
అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥ 15-17
మనఃప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే॥ 16-17

తపస్సు చేయడానికి అరణ్యాలకు పారి పోనక్కరలేదు. గృహస్థుడుగా ఉండి కూడా శారీరక-వాచిక-మానసిక తపస్సులను మూడింటిని చేయవచ్చు. భగవంతుణ్ణి, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించడం, పరిశుభ్రంగా ఉండటం, కపటం లేకుండా ఉండటం, బ్రహ్మచర్యాన్ని పాటించడం 'అహింస' ఇవి శరీరంతో చేయవలసిన తపస్సులు. తనకు, ఇతరులకి కూడా మానసికక్షోభ కలుగకుండా ఉండేటట్లు పరుషంగా లేకుండా మాట్లాడడం, సత్యభాషణం, ప్రియంగా హితాన్ని చెప్పడం, వేదాన్ని, స్తోత్రాలను పారాయణచేయడం వాక్కుతో చేయవలసిన తపస్సులు. మనస్సును ప్రసన్నంగా ఉంచుకోవడం, శాంతంగా ఉండటం, మౌనం, మనోనిగ్రహం, శుద్ధమై, సంస్కారపూర్ణమైన భావపరంపర

భౌతికావసరాలకైన తపస్సులు, ఈ మూడు రకాలైన తపస్సులు ఉత్తమమైనవి. వీటిలో సిద్ధి కలుగకుండా ఏదో అరణ్యానికి పోయి ముక్కుమూసుకొని కూర్చున్నందువల్ల, వేషాలు వేసినందువల్ల ఏమీ లాభముండదు.

105. "యోగ్యులని, ఇవ్వాలి" అని కొన్నింటిని కొంతమందికిస్తాం. ఫలాపేక్షతో కొన్నింటినిస్తాం. ఇష్టం లేకపోయినా అయోగ్యులకు కూడా తప్పనిసరై విసుగుతో కొన్నింటినిస్తాం. ఈమూడింటికి తేడా ఉందా? ఇవి ఎలాంటి దానాలు?

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥ 20-17

యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥ 21-17

అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్॥ 22-17

చాలా తేడా ఉంది. పవిత్రమైన ప్రదేశంలో, మంచి పర్వకాలంలో, యోగ్యుడైన వ్యక్తికి ప్రత్యుపకారాపేక్ష లేకుండా కర్తవ్యబుద్ధితో ఇవ్వాలని ఇచ్చే దానం సాత్త్వికదాన మంటారు. తిరిగి ఉపకారాన్ని పొందాలనే కాంక్షతో, లేక గొప్ప ఫలాన్ని ఉద్దేశించి గాని, చాలా బాధపడుతూ ఇచ్చే దానం రాజసదాన మౌతుంది. అయోగ్యమైన ప్రదేశంలో, యోగ్యం కాని కాలంలో, అయోగ్యులకు, నిర్బంధంవల్ల, విసుగుతో ఇష్టం లేకుండా ఇచ్చే దానం తామసదాన మౌతుంది. ఈమూడింటికి ఫలంలో చాలా తేడా ఉంది. సాత్త్వికదానం వల్ల మంచిఫలం, రాజసదానం వల్ల మధ్యఫలం కలుగుతుంది. తామసదానం వల్ల ఫలం కలుగదు సరికదా! అనర్థం కూడా కలుగుతుంది.

106. జ్ఞానాలు మూడు రకాలంటారు కదా! సాత్త్విక-రాజస-తామస భేదాలుగల ఆ జ్ఞానాల స్వరూపం ఎలా ఉంటుంది?

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే।
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ 20-18

పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్పృథగ్విధాన్।
వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్॥ 21-18

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్॥ 22-18

విభిన్నంగా ఉండే అన్ని భూతాల్లోను ఒక్కటై, నిత్యంగా, అంతరాత్మగా ఉండే పరమాత్మను గుర్తించే జ్ఞానమే సాత్త్వికజ్ఞానం. దీన్నే విజ్ఞానమని అంటారు. లోకంలో ఉన్న పదార్థాల నన్నింటిని వేఱు వేఱుగా అనేక రకాలుగా, అనేక వస్తువులుగా ఏ జ్ఞానం గ్రహిస్తుందో దాన్ని రాజసజ్ఞాన మంటారు. ఈ రాజసజ్ఞానం కలవారికి దేవతలు గూడ విష్ణువని, శివుడని, సూర్యుడని, అంబ అని, గణపతి అని, వేఱు వేఱుగా కనబడతారు. నామ రూప విభాగాన్ననుసరించి దైవభేద భావం వీరికి కలుగుతుంది. ప్రపంచంలో ఉన్న ఏదో ఒక కార్యైకదేశమైన పదార్థాన్నే కారణంగా గ్రహించటం, శరీరాన్నే ఆత్మ అనుకోవటం, కార్యకారణభావం లేక, యథార్థానికి దూరమై, నీచమైనట్టి జ్ఞానం తామసజ్ఞాన మౌతుంది.

107. మనం చేసే పనులు సాత్త్వికాలు కొన్ని, రాజసాలు కొన్ని, తామసాలు కొన్ని. వాటి ప్రత్యేక లక్షణాలేమిటి? వేటిని సాత్త్విక కర్మలంటారు? ఎలాంటి వాటిని రాజస కర్మలంటారు? తామస కర్మలెలా ఉంటాయి?

నియతం సంగరహితమరాగద్వేషతః కృతమ్।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే॥ 23-18

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః।
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్॥ 24-18

అనుబన్ధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే॥ 25-18

రాగద్వేషప్రేరితం కానిది, ఆసక్తి లేనిది, ఫలాసక్తి లేనివానిచే విధ్యుక్తమార్గమున చేయబడినది సాత్త్విక కర్మ అవుతుంది. ఏదో ఒక ఫలాన్ని ఆశించి, నేను దీన్ని చేస్తున్నానని అహంభావంతో, చాలా శ్రమపడి చేసే కర్మ రాజసకర్మ అవుతుంది.

బంధాన్ని కలిగిస్తుందని, నాశాన్ని కలిగిస్తుందని, హింసాత్మకమైందనీ ఆలోచించ కుండానే, తన శక్తిసామర్థ్యాలను దృష్టిలో పెట్టుకోకుండా, అజ్ఞానంతో చేసే కర్మ తామసకర్మ అవుతుంది.

108. సాత్త్విక, రాజస, తామస భేదంతో కర్తలు మూడురకాలుగా ఉంటారు కదా! వారి స్వభావం ఎలా ఉంటుంది?

ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥ 26-18

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ 27-18

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే॥ 28-18

కర్మసంగం లేకుండా, నేను చేస్తున్నాననే కర్తృత్వాభిమాని కాకుండా, స్థిరనిశ్చయంతో, మహోత్సాహంతో, కార్యం సిద్ధించినా, విఫలమైనా ఏ మాత్రం వికారం లేకుండా సమానంగా స్వీకరిస్తూ కర్తవ్యభావనతో కర్మలు చేసే వాడు సాత్త్వికకర్త అవుతాడు. రాగద్వేషాలకు లొంగిపోయిన వాడు, కర్మఫలాన్ని పొందాలనుకునే వాడు, దురాశకల వాడు, ఇతరుల హింసించే స్వభావంకలవాడు, కలుషితుడైన వాడు, సుఖ-దుఃఖాలకు బందీ అయిన వాడు రాజసకర్త. ఏ నీతినియమాలు లేనివాడు, వివేకరహితుడు, గర్విష్ఠి, వంచకుడు, ఇతరులకు మంచి కలుగకుండా చెడగొట్టేవాడు, బద్ధకస్తుడు, ఎప్పుడూ విచారపడే వాడు, ఎంత ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేని వాడు, తామసకర్త అని పిలువ బడతాడు.

109. మనకు సాత్త్విక-రాజస-తామస భేదంతో మూడు రకాల బుద్ధులు కలుగుతాయట కదా! అందులో దేన్ని సాత్త్వికమంటారు? దేన్ని రాజసమంటారు? తామస బుద్ధి ఎలా ఉంటుంది?

ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే।
బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ॥ 30-18

యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।
అయథావత్ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ ॥ 31-18

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ ॥ 32-18

దేనివల్ల మనకు లోకప ప్రవృత్తి-నివృత్తి మార్గాలు, చేయదగిన పనులు, చేయకూడని పనులు, భయపడవలసిన పదార్థాలు, నిర్భయంగా వుండవలసిన వస్తువులు, సంసారబంధం-దాన్నుంచి ముక్తి, వీటిని గురించిన తత్త్వం బోధపడుతుందో అది సాత్త్విక బుద్ధి. దేనివల్ల ధర్మాధర్మ స్వరూపం, కర్తవ్యా కర్తవ్య స్వరూపం, శాస్త్రీయంగా గాక సందిగ్ధంగా తెలుస్తుందో అది రాజసబుద్ధి. ఏది అజ్ఞానావరణం వల్ల అధర్మాన్ని ధర్మంగా, ధర్మాన్ని అధర్మంగా, ఇలాగే లోకంలో వస్తువులను యథార్థంగా గాక భ్రమతో వేరే విధంగా మనకు తెలియజేస్తుందో అదే తామసబుద్ధి. కాబట్టి తామస-రాజస బుద్ధులను వదలి సాత్త్వికబుద్ధులు కలగడానికి ప్రయత్నించాలి.

110. ధృతి అంటే స్థైర్యం కదా! అది సాత్త్వికధృతి అని, రాజస ధృతి అని, తామసధృతి అని మూడు రకాలుగా ఉంటుందట కదా! వాటి ప్రత్యేక లక్షణాలేమిటి?

ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః ।
యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ ॥ 33-18

యయా తు ధర్మకామార్థాన్ధృత్యా ధారయతేఽర్జున ।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ రాజసీ ॥ 34-18

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముంచతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ ॥ 35-18

అనన్యమైన యోగం ద్వారా మనస్సు, ప్రాణాలు ఇంద్రియాలు వీటి వ్యాపారాలను నిగ్రహించి, నియమించి లక్ష్యమ్నుంచి పతనం కాకుండా వాటిని దృఢంగా ధరించే స్థైర్యానికే సాత్త్విక ధృతి అని పేరు. ఫలాసంగం వల్ల, ఫలాభిలాషతో ధర్మం-అర్థం-కామం అనే త్రివర్గాన్ని శిథిలత్వంగా ధరించే స్థైర్యమే రాజస ధృతి. ఎవడు నిద్రను, భయాన్ని

చింతను, దుఃఖాన్ని, మదాన్ని దుర్బుద్ధితో ఏ స్థైర్యంవల్ల విడిచిపెట్టడో అది తామస ధృతి. వీటిలో తామస-రాజస స్థైర్యాలను వదిలి, సాత్త్విక స్థైర్యాన్ని పెంపొందించు కోవాలి.

111. మానవుడికి ఎన్నో రకాల సుఖాలు కలుగుతాయి. కొన్ని మొదట్లో అట్టే బాగుండవు, కాని తరువాత బాగుంటాయి. ఇంకొన్ని మొదట్లో చాలా బాగుంటాయి. కానీ కాలం గడిచే కొద్దీ బాగుండవు. ఇంకా కొన్ని మొదట చివర కూడా అజ్ఞానంలో ముంచి వేస్తాయి. వీటివేమంటారు ?

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధి ప్రసాదజమ్॥ 37-18

విషయేన్ద్రియ సంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥ 38 18

యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహనమాత్మనః।
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్॥ 39-18

సుఖాలు సాత్త్విక-రాజస-తామస భేదంతో మూడురకాలు. ఏది మొదట విషం లాగా చాలా కష్టాన్ని కలిగించి, కాలక్రమేణ అభ్యాసం చేయగా చేయగా అమృతం లాగా పరిణమిస్తుందో, ఏది నిర్మలమైన బుద్ధియొక్క ప్రసన్నత వల్ల కలుగుతుందో, ఆ సుఖం సాత్త్విక సుఖం. తన కిష్టమైన శబ్ద-రూపాది విషయాలలో శ్రోత్ర-నేత్రాది జ్ఞానేంద్రియాలకు సంయోగం కలిగితే అమృతం లాంటి ఆనందం కలుగుతుంది. కాని కాలం గడవగా అది పరిణామాన్నంది విషతుల్యమై దుఃఖాన్ని కలిగిస్తుంది. అదే రాజస సుఖం. నిద్రవల్ల, బద్ధకం వల్ల, అజాగ్రత్త వల్ల తాత్కాలికంగా సుఖం కలుగుతుంది. ఇది మొదట్లోను చివరు కూడా ఆత్మను అజ్ఞానంలో పెడుతుంది. అలాంటి సుఖం తామససుఖం. వివేకం గలవాడు సాత్త్విక సుఖాన్నే కోరతాడు. రాజస-తామససుఖాలను దగ్గరకు రానీయడు.

112. బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు, శూద్రులకు ప్రకృతి సిద్ధంగా ఉండవలసిన లక్షణాలేమిటి? ఏలక్షణాలుంటే వారి

వారిని అలా పిలువవచ్చు?

శమో దమః తపఃశౌచం క్షాన్తిరార్జవమేవ చ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్॥ 42-18

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥ 43-18

కృషిగోరక్షవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ 44-18

శ్రోత్రాది జ్ఞానేంద్రియనిగ్రహం, వాక్కు మొ॥ కర్మేంద్రియ నిగ్రహం, శారీరక-వాచిక–మానసిక తపస్సులు, పరిశుభ్రత, ఓర్పు, కపటం లేకపోవడం, జ్ఞాన-విజ్ఞానాలు, దేవునిపైన, పునర్జన్మపైన, వేదాలపైన నమ్మకం, ఇవి బ్రాహ్మణునికి స్వభావసిద్ధమైన కర్మలు. శౌర్యం, ప్రకాశం, ధైర్యం, సమర్థత, యుద్ధంలో వెన్నుచూపకుండుట, దానం చేయడం, ప్రభుత్వం, ఇవి క్షత్రియుడికి సహజసిద్ధమైన కర్మలు. వ్యవసాయం, గోసంరక్షణ, వ్యాపారం, వైశ్యునికి స్వభావసిద్ధమైన కర్మలు. సేవచేయడం శూద్రునికి సహజమైన కర్మ. ఈ కర్మ లక్షణాలు వారిలో ఉంటే వారు అలా పిలవబడడానికి అర్హులు.

113. భగవంతుని ఆరాధించడానికి వారు వారు నిర్వహించే వృత్తులు అడ్డువస్తాయా? లేక ఎవరు ఏ పనిచేసినా సక్రమంగా ఆపనిని చేయడం ద్వారా భగవదారాధనం చేయవచ్చా?

స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు॥ 45-18

యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥ 46-18

భగవంతుణ్ణి ఆరాధించడానికి ఎవరి వృత్తి ఎవరికీ అడ్డువపదు కదా! అదే సాధనం కూడా అవుతుంది. అయితే కర్మసంగం లేకుండా తన వృత్తి ధర్మాన్ని సక్రమంగా నిర్వహించడం ద్వారానే పరమాత్మను ఆరాధిస్తున్నాననే భావంతో కర్మయోగంతో ఆయనను ఆరాధించాలి. అపుడు వాడికి యోగసిద్ధి కలుగుతుంది. ఈ ప్రపంచమంతా ఎవరి మంచి

పుట్టిందో, ఎవరు ఈ సమస్త విశ్వాన్ని వ్యాపించి ఉన్నారో, అలాంటి పరమాత్మను తను చేస్తున్న ప్రతిపనితోను సేవించి మానవుడు మాధవుడు కావచ్చు. తన కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించాలి ఫలాపేక్షారహితమైన ప్రవృత్తి పరమాత్మసాయుజ్యానికి దోవ తీస్తుంది.

114. నాధర్మం నాకు రుచించడం లేదు. ఇతరుల ధర్మం నన్నాకర్షిస్తున్నది. దాన్ని చక్కగా చేయ గలుగుతున్నాను. దాని వల్ల నాకు భౌతికమైన ప్రయోజనం కూడా కనపడు తున్నది. ఈ సమాజంలో నా ధర్మం నాకు పనికి రానప్పుడు పరధర్మాన్ని ఆశ్రయించడం తప్పా?

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ 47-18

సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్।
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః॥ 48-18

తాత్త్విక దృష్టితో ఆలోచించినప్పుడు తప్పని చెప్పక తప్పదు. ఇతరుల ధర్మం నీకెంత అందుబాటులో ఉన్నా ప్రయోజనకారి అయినా, స్వధర్మం ఎంత నీచంగా నీకు కనబడ్డా నీ ధర్మాన్ని నీవు వదలకుండా ఆచరించడమే మంచిది. స్వాభావికమైన కర్మలను ఆచరించడం వల్ల నీకు పాపం అంటదు. స్వధర్మాన్ని వదిలి అట్లే పరధర్మం కోసం పాకులాడితే ఒకరిపై ఒకరికి అహంకారం, అసూయ, దురభిమానం, పోటీ, పెరిగి సమాజ వ్యవస్థ కూలిపోయి పాపాలకు ప్రతివాడూ పాల్పడతాడు. కనుక ఏ పరిస్థితిలోను పరధర్మంలోకి పారిపోవడం మంచిది కాదు. తనకు స్వభావసిద్ధమైన కర్మను, ఎంత దుష్టమైన దానైనా వదిలి పెట్టకూడదు. ఎందుకంటే నిప్పు చుట్టూ పొగ ఉన్నట్లు, ప్రకృతి సంబంధం చేత ప్రతికర్మకు దోష సంబంధం ఉండక మానదు. పొగను చూచి భయపడి నిప్పును వదలి పారిపోయినట్లు స్వధర్మంలో దోషాన్ని చూచి పారిపో కూడదు

115. నేను చేస్తున్న పనులన్నీ నా ప్రయోజకత్వంవల్లనే సాధింప బడుతున్నాయనీ, నా తెలివి తేటల వల్లనే ఇతరులకంటే గొప్పగా ఎన్నో కార్యాలు సాధించానని చాలా రోజులు అహంకారపడ్డాను.

ఏపని చేసినా కలిసి రాలేదు. నేను ఏమీ చేయలేనని అర్థమయింది. ఏం చేయాలి? నేనెలా ప్రవర్తించాలి?

> చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।
> బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ ॥ 57-18

ఎప్పుడూ, అపజయం కలిగినప్పుడే మన స్వరూపం మనకు అర్థమవుతుంది. నిరుత్సాహ పడకండి. కర్మయోగాన్ని అభ్యాసం చేయండి. మానసికంగా మీరు చేసే ప్రతి పనిని ఫలాపేక్ష లేకుండా భగవంతునికి సమర్పించండి. ఆయన పైనే మనస్సును నిలపండి. నిష్కామబుద్ధితో, కర్తవ్యభావనతో, యోగనిష్ఠతో దేవుణ్ణి నమ్మి ప్రవర్తించండి. మీ యోగ-క్షేమాలు ఆయనే చూసుకుంటారు. దిగులు పడకండి. విఘ్నాలకు వెనుకంజ వేయకండి.

116. భగవంతుణ్ణి ఎప్పుడూ ధ్యానిస్తుంటే మనకు కలిగే విఘ్నాలు ఆయన దయవల్ల పోతాయా? మన పాపాలు నటావంచలై కార్యసిద్ధి కలిగి, శాంతి కలుగుతుందా? అలా కాకుండా కర్తృత్వాహంకారంతో ఉండే వారి గతి ఏమౌతుంది?

> మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి ।
> అథ చేత్త్వమహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి ॥ 58-18

తప్పక మనకు కలిగే సర్వవిఘ్నాలు ఆయన దయవల్ల పోతాయి. మనకు కార్యసిద్ధి కలిగి శాంతి కలుగుతుంది అయితే మనం ఆయన్ని అనన్యభక్తితో సేవించాలి, నమ్మాలి. అలా కాకుండా అహంకారంతో, గర్వంతో ఆయన సదుపదేశాన్ని వినకుండా ప్రవర్తిస్తే నాశం తప్పదు కనుకనే ఆయన్ని ఆశ్రయించు. అన్ని భారాలు ఆయనపైన వేసి సుఖంగా శాంతిగా ఉండు.

117. దేవుడున్నాడా? ఉంటే కంటికి కనపడడేం? ఆయన జీవుల నందరినీ తన మాయతో సంసారచక్రంలో తిప్పే వాడంటారే! ఆయన ఎక్కడున్నాడు?

> ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
> భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥ 61-18

దేవుడు లేకపోతే నీ వెక్కడున్నావు? ఈ లోకాలన్నీ ఎక్కడున్నాయి? ఆయన శక్తులు మహిమలు అనంతాలు. ఆయన సర్వవ్యాపి. జీవులందరి హృదయాకాశంలో అంతరాత్మగా ఆయన ప్రకాశిస్తున్నాడు నీ కోలుకళ్లు ఆయన్ను చూడలేవు. అవి అజ్ఞానావృతమైనవి. నీ ముందు నీవు పెట్టిన వస్తువునే అవి సరిగా చూడలేవు. ఇంకా భగవంతుడెలా వాటికి కనపడతాడు. అతడు వివేకంగల జ్ఞానచక్షువులకే కనపడతాడు. అతడు అంతర్యామిగా జీవులమైన మన అందరి హృదయాల్లో ఉండి, తన మాయాప్రభావంలో బొమ్మలను, పిల్లలను యంత్రాన్నెక్కించి మనం గిర గిర తిప్పినట్లు ఈ సంసారచక్రం మీద కెక్కించి, భ్రమపెట్టి మనల్ని తిప్పుతున్నాడు. కాబట్టి నీలోనున్న ప్రపంచాన్ని విమర్శించుకో. లోపల ఉన్న పరమాత్మ కనబడతాడు.

118. భగవంతుణ్ణి నమ్మి, ఆయన మీదనే అన్ని భారాలను మోపి, మన కర్తవ్యాన్ని మనం ఆచరిస్తే మోక్షం కలుగుతుందా?

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥
62-18

తప్పక కలుగుతుంది. నీవు స్వతంత్రుడివి కాదు. దేవుని దయలేందే నీప్రేయత్నం ఏదీ నెరవేరదు. కనుక ఆయన్ను అన్ని విధాలా శరణు పొందు. నీమనస్సును ఆయన కర్పించు. నీకర్తవ్యాన్ని నిర్వహించు. ఆయన అనుగ్రహం పొందడానికి అర్హతను సంపాదించు. ఆయన దయవల్ల శాంతిని, శాశ్వతమైన పరమపదాన్ని పొందుతావు. నేను చేస్తున్నాననే అహంకారాన్ని వదలుకో.

119. కొన్ని తత్త్వశాస్త్రాలు, "చెప్పిన దాని మీద విశ్వాసముంచాలి గాని ఎదురు ప్రశ్నించరాదం" టాయి కదా! మన వేదాంతం గురువు చెప్పిన దాన్ని తు. చ తప్పకుండా గుడ్డిగా నమ్మమంటుందా? లేక హేతుబలంతో విచారించి, నిర్ణయించుకొని, నచ్చిన పద్ధతిలో ఆచరించమంటుందా?

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్ గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ 63-18

అదే మన వేదాంతంలో ఉన్న విశిష్టత గుడ్డిగా నమ్మమని, ప్రశ్నలు వేయవద్దని చెప్పేది కాదు మన వేదాంతం. సాధకుడికి స్వాతంత్ర్యం ఉంది. అనుభవరూపంగా వారికి నమ్మకం కలిగితేనే అలా ఆచరించమని మన తత్త్వశాస్త్రవేత్తలు ఉపదేశిస్తున్నారు. ఎవరు ఎవరికి ఏ జ్ఞానాన్ని ఉపదేశించినా స్వానుభవంతో మంచి హేతువులతో దాన్ని విచారించి ఎలా చేయడం మంచిదనిపిస్తే అలా చెయ్యమని చెప్పారే కాని "నేను చెబుతున్నాను కాబట్టి నీవు చెయ్" అని అనలేదు. గీతోపదేశం చేసిన శ్రీకృష్ణపరమాత్మ కూడా అర్జునుడికి ఆ స్వాతంత్ర్యం ఇస్తున్నారు. ఇది ఇతర తత్త్వశాస్త్రాలలో మృగ్యం.

120. భగవంతుణ్ణి ఆరాధిస్తే సంసారంలో బాధలు తగ్గి మోక్షం లభిస్తుందని ఎవరు చెప్పారు? దానికేదైనా ప్రమాణమున్నదా?

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥ 65-18

ఎవరో చెపితే మనమెందుకు వింటాం? సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మ ఇలా చెబుతున్నారు. "నీమనస్సును నాకంకితం చెయ్. అలా చెయ్యక పోతే నాపై అనన్యభక్తితో ఉండు. అదీ చేయలేక పోతే నీ శక్తి వంచనలేకుండా నన్నే ఆరాధించు. అందుకు నాకు శక్తి లేదంటే నన్ను శరణాగతి చెయ్. నీ భారాలన్నీ నాకు వదలి నిశ్చింతగా శాంతితో కాలం గడుపు. నీవు తప్పకుండా నన్నే పొందుతావు. ఇది ముమ్మాటికీ సత్యం. నీవు సాధకుడవు. కాబట్టి నాకు ప్రియుడవు. నేను ప్రతిజ్ఞ చేసి చెబుతున్నాను. నన్ను నమ్ము" అని శపథం చేసి చెబుతుంటే ఇంకా దానికి ప్రమాణమేం కావాలి. కావలసింది మనకొక నిశ్చయం. అభ్యాసం.

121 మనధర్మంలో అన్నింటికంటే తేలికైన మోక్షమార్గ మేమిటి? దానిలో నడిచే భక్తుని పాపాలన్నీ పోగొట్టి భగవంతుడు మోక్షాన్ని అనుగ్రహిస్తాడా?

సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥
66-18

మన ధర్మంలో ఉపదేశించబడ్డ కర్మ-జ్ఞాన-భక్తిమార్గాలలో భక్తి మార్గసారభూతమైన

శరణాగతి సర్వసులభమైన మోక్షమార్గం. ఎందువల్లనంటే ప్రతివాడు ఏది తనకు ధర్మం? ఏది తనకు అధర్మమని నిర్ణయించు కొనే శక్తి గలవాడుగా ఉండడు. నిర్ణయించుకో గల్గినా దాన్ని సక్రమంగా ఆచరించడం అంత తేలిక కాదు కాబట్టి ధర్మాల నన్నింటిని దేవుని యందే వదలి ఆయన్నే సర్వరక్షకుడుగా, మోక్షదాతగా శరణు పొందడం చాలా తేలికైన మార్గం. అంతే కాకుండా దీన్ని బోధించినవాడు కూడా భగవంతుడే. అలా శరణాగతి చేసిన భక్తుణ్ణి అన్ని పాపాలనుంచి విముక్తుణ్ణి చేసి మోక్షాన్ని ప్రసాదించడానికి ఆయన సంసిద్ధంగా ఉన్నాడు. నీవేమీ దుఃఖపడ వద్దంటున్నాడు. మనం అనన్యభక్తితో ఆయన్ను నమ్మి ఫలాపేక్ష లేకుండా శరణాగతి చేయగలిగితే, మన యోగక్షేమాలను ఆయన విచారిస్తాడు. ఇదే మన వేదాంతసారం.

T T D Religious Publications Series No 24

Price Rs 7 00

## ఆగండి! ఒక్కనిమిషం ఆలోచించండి!

ఎందుకలా దిగులుపడుతున్నారు? మనసు బాగాలేదా? జీవితం ఉత్సాహంగా ఉన్నట్లు లేదు. హఠాత్తుగా ఏదో జరిగినట్లుంది. ఎందుకలా ఆశ్చర్యపడుతున్నారు? జీవితం ఎన్నో మలుపులు తిరుగుతుంది.

ఫలితాన్ని గురించా ఆలోచిస్తున్నారు? అబ్బే లాభంలేదండి! మీ ఆలోచనా విధానంలోనే పొరపాటుంది. ఫలితాన్ని ఆశించకుండా నేనెందుకు పనిచేయాలంటున్నారా! అక్కడే ఉందండి అసలు కిటుకు. కర్తవ్యభావంతో దేన్నీ ఆశించకుండా పనులు చేయడం అలవాటుచేసుకోండి! ప్రశాంతి మీ స్వంతమౌతుంది. మీ సంతోషానికి అవధులుండవు.

"ఈయనెవరండీ! దేవుణ్ణి అలా తిట్టిపోస్తున్నాడు? "

"అయినా! చాలా అన్యాయమైపోయినాడండీ! దేవుడనే వాడుంటే ఇలా పట్టించుకోకుండా వదిలేస్తాడా? మనలో మాట - అసలు దేవుడున్నాడంటారా? "

ఇవి ఈనాడు ఇంటా బయటా సమస్యలతో సతమతమౌతున్న సగటుమనిషి ఆలోచనలు. జీవితపరమార్థం అంతుబట్టని మనిషిచుట్టూ ఇలాంటి సమస్యలు ముసురుతుంటాయి. మరి ఈ సమస్యలకు పరిష్కారమే లేదా? ఎందుకు లేదు. మానవజీవితానికి సంబంధించిన ఇలాంటి సమస్యల కన్నింటికీ పరిష్కారం కావాలంటే చదవండి--

ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య గారి సుప్రసిద్ధరచన

**మన సమస్యలకు భగవద్గీతా పరిష్కారాలు**

ఓర్పుతో నేర్పుతో మంచి నిర్ణయాలు తీసికొని జీవితాన్ని సుఖమయం చేసుకోండి! ఆనందమయం చేసుకోండి! శాంతిమయం చేసుకోండి! అహంకారాన్ని ఆవేశాన్ని దగ్గరకు రానీకండి! ఆత్మతత్త్వాన్ని అనుభూతిలోకి తెచ్చుకోండి!

ఇదిగో! ఇంకెందుకాలస్యం ఇప్పుడే ఇక్కడే చదవండి..................

Printed and Published by Sri **A.P.V N.SARMA, I.A S**, Executive Officer, T T Devasthanams, Tirupati and Printed at T T D Press, Tirupati

